17.5.1996 శుక్రవారం 12 పేజీలు సంపుటి:68 సంచిక:20 విడిప్రతి రూ.2.00లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



# బాబు రాజ్యమిక భద్రం!

పార్లమెంటు ఎన్నికల పుణ్యమా అని ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు రాజకీయంగా బలోపేతుడై పోయారు. కనీసం డిపాజిట్లయినా దక్కుతాయా, ఒకటి రెండు చోట్లనైనా గెలుస్తారా అన్న సందేహంతో ఎన్నికల ప్రచారం ప్రారంభించిన ఆయన ఏకంగా 16 మంది ఎమ్పీలను ఢిల్లీకి తీసుక వెళ్ళారు. రాజకీయంగా మరుగుజ్జు వంటి చంద్రబాబు నాయుడుకిది మహా ఘనవిజయం క్రిందే లెక్క. ఎన్టీఆర్ అల్లుడిగా తెరవెనుక మంత్రాంగం నడపడం తప్ప, తెర ముందుకు ఎప్పుడూ వచ్చినవాడు కాదు చంద్రబాబు. జనంతో ఆయనకు పరిచయం లేదు. చిత్తూరు జిల్లాదాటి మరెక్కడా ప్రజలకు ఆయన తెలియదు. నాయకత్వ లక్షణాలు లేవు. వక్త కూడా కాదు. ఛారిస్మా లేదు. ఏదీ లేకపోయినా కాంగ్రెస్ వ్యతిరేక ఓటును, ఎన్టీఆర్ నిర్మించి పోయిన తెలుగుదేశం ఓటు బ్యాంకును తన పరం చేసుకోవడంలో కృతకృత్యులైనారు.

ఈ విజయంలో ఆయన వంతు ఒకటైతే, మూడు వంతుల ఘనత ఈనాడు రామోజీరావు గారిది. తన పత్రికను, తన ఈటీవిని చంద్రబాబుకు అంకితం చేసేశారాయన. ఎన్టీఆర్‌కు వెన్నుపోటు పొడిచి అధికారం దురాక్రమించు కున్న ద్రోహిగా జన ఛీత్కారం భరించ వలసిన వాడిని, ఎన్టీఆర్ వారసుడిగా, సత్కారం అందుకునేటట్లు ప్రచారం చేశారు. రామోజీ రావు లేకుంటే; తక్కిన దిన పత్రికలూ నిజాన్ని దాచిపెట్టి వంత పాడకుండా వుండి వుంటే చంద్రబాబు ఈ ఎన్నికలతో రాజకీయంగా సమాధై పోయి వుండేవాడు. కాని పత్రికాధిపతులు, పోలీసులు ఆయన్ను కాపాడారు.

దాని ఫలితంగా రాష్ట్రంలో ఆయన ప్రభుత్వం సుస్థిరమై పోయింది; రాజ్యం భద్రంగా నిల్చింది. ఈ ఎన్నికలలో ఓటమి చవిచూచి వుంటే తెలుగుదేశం ప్రభుత్వమూ పతనమై పోయి వుండేది. ఎమ్మెల్యేలు తలా ఒకదారి చూసుకొని వుండేవారు. కాని ఇప్పుడా పరిస్థితి లేదు. చంద్రబాబు చెప్పిందే శాసనంగా చలామణి కావలసిందే ఇక. ఏ ఎమ్మెల్యేకు కూడా ఆయన్ను కాదనే ధైర్యం లేదు. ఎవరి వత్తిడులకూ లొంగవలసిన అగత్యం లేదు.

అందులోనూ ఢిల్లీ రాజకీయాలలో చంద్రబాబు చాలా కీలక పాత్ర వహించ నుండడంతో రాష్ట్రంలో ఆయన విలువ చాలా పెరిగింది. ఎవరు ప్రధాన మంత్రి అయినా 16 మంది ఎమ్పీలు కల్గిన తెలుగుదేశం పార్టీ దయాదాక్షిణ్యాలు అవసరం. అందువల్లే తన ఎమ్పీలు జారిపోకుండా చాలా జాగ్రత్తగా కాపాడు కొంటున్నారాయన. వారినందరినీ ఢిల్లీలోని ఒక ఫైవ్ స్టార్ హోటల్‌లో పెట్టి, పంజరంలో చిలుకల వలె కాపాడు కొంటున్నారు. వారు చీలిపోయినా, పార్టీ ఫిరాయించినా ఢిల్లీలో తనకు పుట్టగతు లుండవన్నది చంద్రబాబు భయం. ఎమ్పీ లందరూ కలిసి కట్టుగా, ఒక పార్టీగా వుంటేనే ఢిల్లీ ప్రభుత్వాన్ని బ్లాక్ మెయిల్ చేసి రాష్ట్ర ఖజానాకు ఇబ్బందు లెదురవకుండా కాపాడుకో గల్గుతారాయన. ఎమ్పీలు చేజారితే తన ముఖం చూచే వారుండరని చంద్రబాబుకు బాగా తెలుసు. అందువల్లే ఆయన ఎమ్పీలకు పంచ నక్షత్రాల హోటల్‌లో పంచభక్ష్య పరమాన్నాలు వడ్డిస్తున్నారు.

## లక్ష్మిపార్వతికి హరికథలేకాలక్షేపం!

ఇంకొక ప్రక్క లక్ష్మీపార్వతి తెలుగుదేశం పార్టీ లిక్విడేట్ అయిపోతున్నది. దివాలా తీసిన వ్యాపార సంస్థలో కుర్చీ ఒకరు, బెంచీ ఒకరు ఎత్తుకు పోయినట్లు ఆమె పార్టీ కకావికలై పోతున్నది. దగ్గుపాటి వెంకటేశ్వర రావు ఆమెకు గుడ్‌బై చెప్పేశారు. ఎమ్మెల్యేలూ ఎవరి దారి వారు చూసుకొంటున్నారు. కొందరు చంద్రబాబును ఆశ్రయిస్తుంటే, మరి కొందరు కాంగ్రెస్ తలుపు తడుతున్నారు. ఒకవారం పది రోజుల తర్వాత ఆమె పార్టీ అంతరించి పోయినా ఆశ్చర్యం లేదు.

ఎన్నికలలో ఆమె పార్టీకి అంత ఘోర పరాభవం ఎదురు కావడానికి ఆమే కారణం అన్నది నిజం. అభ్యర్థుల ఎంపిక మొదలు ప్రచారం వరకు పరమ నిరంకుశంగా ప్రవర్తించారామె. ఒక్క నాయకుడినీ సంప్రదించ లేదు; ఒక్కరితో మాట్లాడ లేదు; ఒక్కరి మాటా వినలేదు. అంతా ఇష్టారాజ్యంగా జరిపించారు. ఆమెకు రాజకీయానుభవం లేదు. ఎప్పుడూ ఎన్నికలు చేసిందీ లేదు. అటువంటప్పుడు ఎంతో మెలుకువతో, అనుభవజ్ఞుల సలహాలు తీసుకొని వుండాలి. కాని, తన సభలకు వచ్చే జనాన్ని చూసి, వారే ఓట్లు వేసేస్తారని భ్రమపడి ఎన్నికల యంత్రాంగాన్ని విస్మరించారామె. ప్రచారానికి పార్టీ తరపున ఏ అభ్యర్థికీ సహకారం అందించలేదు. పోస్టర్లు, కరపత్రాలు ఇవ్వలేదు. ధనసహాయం చేయలేదు. కనీసం పలుకరింపు లేదు. ఎవరి మానాన వారిని వదిలేశారు. ఎన్నికల నిధి కోసం దండిన డబ్బంతా ఆమె స్వంత ఖజానాకు చేరిపోయింది. టిక్కెట్లు ఇవ్వడానికి రేటు పెట్టి వసూలు చేసిన మొత్తాలూ పెట్టెలో నుంచి బయటకు రాలేదు. ఫలితం ఈ దుస్థితి.

లక్ష్మీ పార్వతికి ఇంక రాజకీయ భవిష్యత్తు లేదనేది స్పష్టమై పోయింది. ఆమె హరికథలు చెప్పుకొంటూ కాలక్షేపం చేయవలసిందే!

రాజకీయ పటం నుంచి లక్ష్మీపార్వతి అదృశ్యం – చంద్రబాబుకు దేముడిచ్చిన వరం. ఒక ప్రధాన రాజకీయ ప్రత్యర్థి శేషం

కొరవ 12 పేజీలో



*వామనుడు నింగి కెదిగినట్లు ఢిల్లీ కెగిరి వెళ్లాడు బాబు – అక్కడ ఆశాభంగా లెదురైనా ఇక్కడ తన మాటే వేదం!*

# వాజ్‌పాయి నిరక్షించను కాంగ్రెస్ చీలిక?

దేశ రాజధానిలో సంబరాలు ప్రారంభమైంది. 80 కోట్ల భారతీయుల తలరాతలు వ్రాసే పెత్తనం కోసం 534 మంది తమ్ముకు చెప్తున్నారు. తమను పరిపాలించ గల వారెవరో తెల్చుకోలేక



భారతీయ ఓటరు చేసిన తప్పిదం ఢిల్లీ వీధుల్లో ఈ తోలుబొమ్మలాటకు ఆస్కారం కల్పించింది.

ఎన్నికలు జరిగి, ఫలితాలు వెల్లడైన స్థానాల సంఖ్య 534 కాబట్టి – ప్రభుత్వ ఏర్పాటుకు కావలసిన స్వల్ప మెజారిటీకి 268 మంది సభ్యుల మద్దతు అవసరం. ఇది కూడా సింపుల్ మెజారిటీ; నిజానికి రాజ్యాంగ సంస్కరణలు, రాష్ట్రపతి, ఎన్నికల కమీషనర్ అభిశంసన వంటి విశేష సమయాలలో ప్రభుత్వ అభిమతం నెరవేరడానికి మూడింట రెండు వంతుల మెజారిటీ అవసరం. అంటే 356 మంది వుండాలి. నెహ్రూ, ఇందిరా గాంధీ, రాజీవ్ గాంధీలు ఈ మెజారిటీతోనే పరిపాలించారు. ఇదిప్పుడు అసాధ్యం కాబట్టి, స్వల్ప మెజారిటీ ప్రకారమే లెక్కలు వేసుకోవాలి.

కానీ 268 సభ్యుల స్వల్ప ఆధిక్యతకు కూడా ఏ పార్టీ దగ్గరలో లేదు. బిజెపికి వుండేది కేవలం 161 మంది ఎంపీలు. వారితో ఎన్నికల పొత్తు కల్గిన శివసేన (15) బన్సీలాల్ హర్యానా వికాస్ పార్టీ (3), చంద్రశేఖర్, జార్జిఫెర్నాండెజ్‌ల సమతా పార్టీ (8), కొత్తగా వచ్చి కలిసిన అకాలీదళ్ (8)లతో కలిపి వారికి 195 మంది సభ్యులున్నారు. ప్రభుత్వం నిలవాలంటే కనీసం 73 మంది మద్దతు సేకరించాలి.

ఇంతమంది ఎక్కడి నుంచి వస్తారు? డిఎంకె, చంద్రబాబు నాయుడులు తాము బిజెపికి వ్యతిరేకమని పదే పదే చెప్తున్నారు. వారు వాజ్‌పేయిని సమర్థించ లేరు. ఒకవేళ డిఎంకె (17), మూపనార్ కాంగ్రెస్ (20), చంద్రబాబు (16)లు ముగ్గురూ సమర్థించినా 53 మాత్రమే వస్తాయి. ఇంకా 20 తక్కువ. తివారి కాంగ్రెస్ (4), మాధవరావ్ సింధియాలూ చాలరు.

ఎటు నుంచి ఎటు చూసినా కాంగ్రెస్‌లో చీలిక వస్తే తప్ప బిజెపి ప్రభుత్వం నిలబడే అవకాశం లేదు. చరణ్ సింగ్ వలె బలం అంచనా లేకుండా ప్రభుత్వం ఏర్పాటు చేసి, పార్లమెంటు ముఖం కూడా చూడకుండా దిగిపోయే అభాసు పనికి వాజ్‌పేయి ఒప్పుకుంటారా? పదిహేనురోజుల సమిపించిన తన యాభైఏళ్ల రాజకీయ జీవిత ప్రతిష్టను పణంగా పెట్టేంత అవివేకి కాదాయన. తెరవెనుక ఆయనకేదో హామీ లభించి వుండాలి. అది ఏది? పివి నరసింహారావు గారు విశ్వాస తీర్మానం సమయంలో కాంగ్రెస్ సభ్యులను గైరహాజరు కమ్మంటారా? అది జరిగితే నలుగురైదుగురు స్వతంత్రుల మద్దతుతో బిజెపి ప్రభుత్వం నిలుస్తుంది. అయితే అది కేవలం తాత్కాలికం. రేపు బడ్జెట్ తీర్మానం సమయంలో మళ్లీ పేచీయే; తుమ్మితే వూడే ముక్కులాగా వుంటుంది ప్రభుత్వం. అటువంటి కక్కుర్తికి వాజ్‌పేయి సమ్మతించక పోవచ్చు. కాంగ్రెస్‌లో చీలిక వచ్చి 60 లేదా 70 మంది విడిపోయి బిజెపిని సమర్థించే ఏర్పాటు ఏదో వుండాలని పరిశీలకుల అనుమానం. అంతటి తీవ్రపరిణామానికి

> ఏ హామీ లేకుండా చరణ్ సింగ్ వలె అభాసుపాలయ్యే పదవికి వాజ్‌పేయి అంగీకరించడు; బల పరీక్షకు ఏదో ఒక ఏర్పాటు జరిగే వుండాలి; అది కాంగ్రెస్ నుంచి వచ్చినా వింత కాదు!

నాయకత్వం వహించేదెవరు? అందరు వర్గాలను ఏకోకరించి, ఒప్పించగల్గిన సమర్థత ఏ కాంగ్రెస్ నాయకుడిలో వుంది?

బిజెపికి వ్యతిరేకంగా, జనతా దళకు తమ మద్దతు తెలియజేస్తూ రాష్ట్రపతికి జాబు పంపడంలో పివి నరసింహారావు గారు రెండు గంటలు ఆలస్యం చేయడం ఆయన పట్ల పలు అనుమానాలకు, విమర్శలకు దారి తీస్తున్నది.

15 తేది జరిగిన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఇష్టాగోష్టి సమావేశంలో దేవగౌడను సమర్థించాలని తీర్మానించారు. బిజెపిని అధికారానికి దూరంగా పెట్టాలన్న లక్ష్యంతో ఈ నిర్ణయం తీసుకున్నారు. పార్టీ నియమావళి ప్రకారం తీర్మానాలు చేయడానికి అప్పుడు సమయం చాలదు

కొరవ 12 పేజీలో

## రాష్ట్రపతి నిర్ణయం రాజ్యాంగానుసారం!

ప్రభుత్వ ఏర్పాటుకు ప్రథమంగా వాజ్‌పేయికి అవకాశం ఇవ్వడం పట్ల జనతాదళ్, వామపక్ష, ప్రాంతీయ పార్టీల నాయకులు రుసరుస లాడుతున్నారు కాని, ఈ విషయంలో రాష్ట్రపతి చేసిన నిర్ణయం రాజ్యాంగానుసారమే జరిగిందన్నది నిజం. చాలీచాలని బలాధిక్యతతో పార్లమెంట్ ఎన్నికల ఫలితాలు వెలువడితే ఏమి చేయాలో రాజ్యాంగంలో స్పష్టంగా వ్రాసి వుంది. (1) అతి పెద్ద పార్టీ నేతను పిలవడం. (2) ఆయన నిరాకరించినా లేదా బలనిరూపణ చేసుకోలేక పోయినా తర్వాతి పెద్ద పార్టీని పిలవడం. (3) అదీ విఫలమైతే లోకసభను సమావేశ పరచి నాయకుడ్ని ఎన్నుకోమని కోరడం. (4) పార్లమెంట్‌ను రద్దు చేసి ఎన్నికలు జరిపించడం. ఈ క్రమాన్ని పాటించడం రాష్ట్రపతి ధర్మం. 1989లో వెంకట్రామన్ అదే చేశారు.

ముందు విపి సింగ్‌ను ప్రధాన మంత్రిగా నియమించారు; ఆయన పడిపోగానే తర్వాత పెద్ద పార్టీ కాంగ్రెస్‌ను పిలిచారు; ఆయన వద్దనేసరికి చంద్రశేఖర్‌కు అవకాశం ఇచ్చారు; ఆ తర్వాత పార్లమెంట్‌ను రద్దు చేశారు. ఈ సాంప్రదాయాన్ని విస్మరించి, కొత్త పద్ధతులవలంబించ వలసిన అవసరం శంకర్ దయాళ్ శర్మకు ఏమి వుంది? అందువలన



ఆయన చేసిన నిర్ణయం సమంజసం.

15 రోజుల గడువును తప్పుపట్టడం కూడా తొందరపాటే. 1989లో విపి సింగ్‌కు 30 రోజుల గడువు ఇచ్చారు.

రేపు మే 31 తేది లోపల వాజ్‌పేయి మెజారిటీ సంపాదించ లేనప్పుడు, తర్వాత అవకాశం కాంగ్రెస్ నేత పివి నరసింహా రావు గారికి వస్తుంది. ఆయన నిరాకరించి నప్పుడే జనతాదళ్, లెఫ్ట్ ఫ్రంట్‌ల కూటమికి పిలుపు. అంతవరకు ఓర్పు పట్టడం వారి ధర్మం.

బిజెపి కంటే కాంగ్రెస్‌తో కలుపుకొని తమ కూటమికి అధిక సంఖ్యా బలం వుంది కాబట్టి, తమను పిల్చి వుండాల్సిందని వీరు చేస్తున్న ఆగం న్యాయం కాదు. రాజ్యాంగం ప్రకారం – ఎన్నికలలో ఒక అవగాహనతో, పరస్పర సహకారంతో పోటీ చేసిన పార్టీలతోనే ఒక కూటమి ఏర్పడాలి. ఒకరి మీద ఒకరు పోటీ చేసినవారు ఏకపక్షంగా గుర్తింపు పొందలేరు. అందువల్ల కాంగ్రెస్ మద్దతు పార్లమెంటులో ప్రభుత్వం పడిపోకుండా కాపాడుకోవడానికి తీసుకోవలసిందే కాని, ప్రభుత్వ ఏర్పాటుకు పరిగణించడానికి లేదు. ఎన్నికలలో జనతాదళ్, కమ్యూనిస్టుల ఫ్రంట్ కాంగ్రెస్‌ను వ్యతిరేకించి నిలబడింది. ఇది తెలిసీ రాష్ట్రపతిని నిందించడం రాజకీయ పందుయుకు తనం.

# ప్రాంతీయ పార్టీలే దేశ భవితవ్యాన్ని శాసిస్తున్నాయి!

> ప్రాంతీయ పార్టీల మద్దతు లేకుండా కేంద్రంలో ప్రభుత్వం మనజాలని విచిత్ర పరిస్థితి నెలకొంటున్నది!

ప్రాంతీయ పార్టీలు దేశరాజకీయాలను ప్రభావితం చేసే దుర్దినాలు ప్రారంభమైనాయి. రాజకీయ పార్టీనేతలు మరుగుజ్జులుగా కుంచించుకు పోయి, ప్రజలలో జాతీయ వాద స్ఫూర్తిని రేకెత్తించ లేకపోవడం వల్లనే ఈ దౌర్భాగ్యం. ఆ సేతుహిమనగ పర్యంతం భారత జాతిని పలకరించి, పులకరింప జేసిన మేరు నగధీరులైన నాయకులు అంతరించిపోయి – ఏ రాష్ట్రానికా రాష్ట్రంలో, ఏ జిల్లాకా జిల్లాలో, ఏ నియోజక వర్గానికా నియోజక వర్గంలో పలుకుబడి కల్గినవారే నేతలుగా చలామణి అవుతున్నా రిప్పుడు. ఐదేళ్ల ప్రధానమంత్రిత్వం నెరపిన పివి నరసింహా రావు గారు తన స్వంత కరీంనగర్ జిల్లాలో తన పార్టీ అభ్యర్థిని గెల్పించుకో లేకపోయారు. ఆయనే ఇప్పటికీ భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షుడు. స్వంత తిరుపతి నియోజక వర్గంలో తన పార్టీని ప్రజలకు చేరువ చేయలేకపోయిన చంద్రబాబు నాయుడు జాతీయ రాజకీయాలలో కింగ్‌మేకర్



మూపనార్ చెవిలో ఏ మంత్రోపదేశం చేస్తున్నారో – కరుణానిధి!

పత్తున్నారు. ఢిల్లీ వెళ్లడానికి దారి తెలియని లల్లూ ప్రసాద్ యాదవ్ ఢిల్లీ పీఠంపై తను చెప్పిన వాడే కూర్చొనే రోజు వచ్చేస్తున్నదని సంబర పడుతున్నారు. ఎన్టీఆర్ భార్యగా తప్ప మరొక రూపంలో జనానికి తెలియని లక్ష్మీపార్వతి జమ్మూ కాశ్మీర్‌లో ఎన్నికల ప్రచారం చేసి వచ్చారు. స్వంత నియోజక వర్గంలో డిపాజిట్ కూడా దక్కించుకోలేని అర్జున్ సింగ్ ఒక జాతీయ పార్టీకి కార్యనిర్వాహక అధ్యక్షుడు. గత ఎన్నికల్లో ఒక్క అసెంబ్లీ సీటుకు కూడా నోచుకోని కరుణానిధి ఎర్రకోటపై తాను పెట్టిన తోలుబొమ్మతో నాట్యం చేయాలంటున్నారు. ఏమిటీ దౌర్భాగ్యం?

కానీ ప్రజల తీర్పు ఆ రకంగా వుంది. ఈ ఎన్నికలలో వివిధ ప్రాంతీయ పార్టీలకు 132 సీట్లు లభించాయి. అంటే దాదాపు 4వ భాగం అన్నమాట. శివసేన, తెలుగుదేశం, డిఎంకె,

కొరవ 8 పేజీలో

# అస్థిరత్వానికి ఆరంభం

అస్థిరత్వానికి ఆరంభం

ప్రధాన మంత్రిగా శ్రీ అటల్ బిహారీ వాజ్‌పేయి ప్రమాణ స్వీకారం – స్వతంత్ర భారత రాజకీయాలలో ఒక కీలక పరిణామం. హిందూ మతోన్మాదానికి ప్రతీకగా భావింపబడే భారతీయ జనతా పార్టీ ఢిల్లీకోటపై కాషాయ పతాకం ఎగురవేయ గల్గడం చాలా ఆశ్చర్య కరం. పరమత సహనానికి, లౌకికతత్వానికి పేరు పొందిన భారతీయ ఓటరు – బిజెపికి ప్రభుత్వం నడిపే అవకాశం ఇవ్వడం చాలా విచిత్రమైన విషయం.

అయితే పునాదులు లేని భవంతి వలె ఏర్పడిన ఈ ప్రభుత్వం నిలుస్తుందా? పదికాలాలు కాదు పది వారాలైనా నిలుస్తుందా? ఇప్పుడున్న పరిస్థితులు చూస్తె మాత్రం ఈ ప్రశ్నకు సమాధానం ప్రతికూలంగా చెప్పవలసి వుంటుంది.

ప్రభుత్వ ఏర్పాటే చాలా వివాదాస్పదంగా జరిగింది. బిజెపికి మెజారిటీ లేదు; వచ్చే అవకాశమూ లేదు; తతిమా పార్టీలన్నీ వారిని అంటరాని వారిగా చూస్తున్నారు; ఏ వాల్గుగైదు పార్టీలో కలిసి బలపరిస్తే తప్ప వారికి మెజారిటీ రాదు. పార్టీ ఫిరాయింపులను ప్రోత్సహించ కుండా, రాష్ట్రపతి నిర్ణయించిన వ్యవధి లోపల బలనిరూపణ చేస్తామని వాజ్‌పేయి చెప్తున్నారు. అదెట్లో ఏ పరిశీలకుడికి బోధపడటం లేదు.

వాజ్‌పాయికి అవకాశం ఇవ్వడం పట్ల తతిమా పార్టీలన్నీ రాష్ట్రపతిని శాపనార్థాలు పెడ్తున్నాయి. ఆయన్ను నిందించడం అనవసరం. రాజ్యాంగం ఏమి చెప్పిందో, అదే చేశాడాయన. ఎన్నికల్లో గెల్చిన అతి పెద్ద పార్టీనేతను ప్రభుత్వ ఏర్పాటుకు ఆహ్వానించాలని రాజ్యాంగం నిర్దేశించింది. 161 సీట్లతో బిజెపి అతి పెద్ద పార్టీగా గెల్చింది కాబట్టి – వారికా అవకాశం ఇచ్చారు శ్రీ శంకర్ దయాళ్ శర్మ. నిర్ణీత సమయానికి తమ కలగూర గంపను సిద్ధం చేయడం చేతకాక, తికమక పడిన జనతాదళ్, సిపిఎం వంటి పార్టీలు ఆయన్ను నిందించడం రాజకీయ దుందు డుకుతనం క్రింద పరిగణించాలి.

బిజెపి అధికారంలోకి రాకుండా నిలుపరించాలన్నది తమ రాజకీయ అవసరమైతే కావచ్చు కాని, దాన్ని రాష్ట్రపతితో గౌరవించా లనడం తొందరపాటు.

నిజానికి పివి నరసింహా రావు గారు కాంగ్రెస్ అభీష్టాన్ని రాష్ట్రపతికి చెప్పి వుంటే పరిస్థితి ఏమై వుండేదో కాని, అది జరగలేదు కాబట్టి రాష్ట్రపతి తీసుకునే నిర్ణయం సంపూర్ణంగా రాజ్యాంగ బద్ధమైనది. ఆ స్థానంలో ఎవరున్నా అదే చేసి వుండేవారు.

అయితే వాజ్‌పేయి ప్రధానమంత్రి అయినాడనే కాని, ఆ ప్రభుత్వ మనుగడ ప్రశ్నార్థకమే. కనీసం 73 మంది ఎమ్పీల మద్దతు కావాలి ఆయనకింకా; కాంగ్రెస్, లెఫ్ట్ ఫ్రంట్‌లు అందుకు సహకరించవు. ప్రాంతీయ పార్టీల మీద ఆధారపడాలి. ఒక్కొక్క ప్రాంతీయ పార్టీ ఒక్కొక్క రకంగా బ్లాక్‌మెయిల్‌కు దిగుతున్నా యిప్పుడే.

అకాలీదళ్ – పంజాబ్‌లో కాంగ్రెస్ రాష్ట్ర ప్రభుత్వాన్ని రద్దు చేయమని షరతు విధించింది. తెలుగుదేశం చంద్రబాబు – మద్యపాన నిషేధం, సబ్సిడీ బియ్యం పథకాల వల్ల తన ప్రభుత్వం పడుతున్న ఆర్థిక ఇబ్బందులను తీర్చాలని నిబంధన పెడుతున్నారు; ఇన్ని రకాల షరతులు, షరతులలో ప్రాంతీయ పార్టీల మద్దతు స్వీకరిస్తె – దాని కొనసాగింపు సాధ్యమా? ఎప్పటికప్పుడు వీరు గొంతెమ్మ కోరికలు కోరుతూ వెళ్తె తీర్చేదెట్లా? తీర్చని మరుక్షణం ప్రభుత్వ పతనం తప్పదు కదా?

బిజెపిని కాకుండా, జనతాదళ్ వంటి పార్టీలతో ఏర్పడిన మూడవ ఫ్రంట్‌కు అవకాశం ఇచ్చి

జమీన్‌రైతు

వుండినా ఈ అనిశ్చిత స్థితి తప్పదు. కేవలం 43 స్థానాలు కల్గిన జనతాదళ్ – దేవగౌడను ప్రధానమంత్రిగా ఎంత కాలం కొనసాగించ గలదు? కాంగ్రెస్‌తో సహా 11 పార్టీలు కలిస్తె కాని – వారికి సరిపడిన సంఖ్యాబలం ఏర్పడదు. వ్యక్తిగత ప్రతిష్ట కోసం ప్రాకులాడే విపి సింగ్, రామకృష్ణ హెగ్డే వంటి నాయకులు ప్రాంతీయ పార్టీల బ్లాక్ మెయిల్‌ను సహించి ప్రభుత్వాన్ని నడిపించగలరా? అసంభవం!

ఏ రూపంలో చూసినా ముందున్నది – అస్థిరత, అనిశ్చిత స్థితులే! మే 31 తేది లోగా బిజెపి తన బలనిరూపణ చేసుకో లేకపోతే – రానున్న ఆరేడు నెలల్లో మనం చాలా మంది ప్రధాన మంత్రుల ప్రమాణ స్వీకారం చూడక తప్పదు.

ఎంతో విజ్ఞత కల్గిన వాడనుకొన్న భారతీయ ఓటరు ఇంత అయోమయ పరిస్థితులు సృష్టించడం విచారకరం. ఏ రెండు ప్రాంతాల ప్రజలు – ఏ ఒక్క పార్టీని విశ్వసించలేని దౌర్భాగ్య పరిస్థితులు ఏర్పడడం కంటే దేశానికి అరిష్టం మరొకటి లేదు. మన రాజకీయ పార్టీలు, నాయకులు అంతగా ప్రజల విశ్వాసం కోల్పోయారు. వారితో ప్రజలు అంతగా విసిగిపోయారు. భిన్నమతాలు, జాతులు, విభిన్న భౌగోళిక పరిస్థితులు, దృక్పథాలు కల్గిన అశేష జనావళిని ఏకత్రాటిపై నడిపించే రాజకీయ నాయకత్వం లేకపోవడం భవిష్యత్‌లో చాలా సమస్యలకు దారి తీస్తుంది. ఆ కష్టకాలానికి నాంది – ఇప్పటి వాజ్‌పేయి ప్రభుత్వం.

---

జమీన్‌రైతు

17.5.1946

పేజీలు: 6. వెల: 0-1-6

### నెల్లూరు ముచ్చట్లు

### అభినందనాలు

మిత్రులు వెన్నెలకంటి రాఘవయ్య గారు చీఫ్ పార్లమెంటరీ సెక్రటరీగా నియమింప బడ్డందుకు అభినందనాలు. తెలివితేటలు, చురుకుదనం, కార్యదక్షతలో ఎవ్వరికీ తీసిపోని వ్యక్తి. కంచ బోయిన పెట్టెలన్నీ దొరికినట్లు మంత్రిత్వం బోయినా కార్యదర్శికత్వమన్నా జిల్లాకు లభ్యపడ్డందుకు మాకంటె సంతోషించె వారుండరు.

* * *

కావలి మునిసబ్ రంగారాం నాయుడు గారు కూలంకషంగా చదువుకొన్న వ్యక్తి. త్వరిత గమనంలో చక్కగా యదార్థాన్ని కనుక్కోగల ప్రజ్ఞాశాలి. వీరు గుంటూరు సబ్‌జడ్జిగా నియమింప బడ్డందుకు వీరికి మా ధన్యవాదాలు.

దేశాల పాత్రల ననుసరించి రథాన్ని నడుపమని నాయుడుగారికి మా సలహా.

### అగ్ని ప్రమాదాలు

చల్లదనం కోసం కాశ్మీరంలో పరమానందభరిత రంగుడై కాలం గడుపు ధనాఢ్యుడైన ఇద్దవరపు నారాయణ రెడ్డి గారి పాదధూళిచె పునీతంబైన నెల్లూరు తాలూకా మాచర్లవారిపాళెంలో 12 తెది సాయంత్రం సుమారు 15 పూరిండ్లను అగ్ని దేముడు కాల్చెను.

12 తెది కలిపాదులో అత్రినరపు రమణా రెడ్డి ఇంటిని, ఒక పుట్టి ధాన్యంతో కూడా భస్మం చేసెను.

అగ్ని ప్రమాదాల్లో ఫైరు సర్వీసువారు చాలా ఆదుకొంటున్నారు. కాని మాచర్లవారిపాళెంలో నీళ్లే లేకపోతె వారు మాత్రం ఏం చేయగలరు.

50 ఏళ్ళ క్రితం ఈ వారం

ఈ విధంగా ఈ సంవత్సరం అగ్ని దేవుడూ పూరిండ్ల మీద వీర విహారం చేస్తున్నాడు. ఏమయ్యా అంటె ప్రజా ప్రభుత్వం గదా అని విచ్చలవిడిగా సంచరిస్తున్నానంటాడు. వాయు దేముడు తమ్ముడు అగ్ని దేముడు.

ఓరి పిచ్చివాడా? ఇలాంటి దుర్మార్గాలు చేశావంటె రాష్ట్ర పరుల మాదిరే నీకు గూడా జైల గోసి నున్నం బెరతాం సుమా జాగ్రత్త.

* * *

కొరవ 11వ పేజీ

---

# రాజకీయ టక్కుటమార విద్యలో చంద్రబాబుకు సాటిలేరెవ్వరూ?

రాష్ట్రంలో ఒక్క లోకసభ స్థానం రాదనుకొన్న చంద్రబాబు నాయుడి నేతృత్వంలోని తెలుగు దేశం పార్టీకి 16 సీట్లు వచ్చాయి. రాజకీయాలంటె గజకర్ణ, గోకర్ణ, టక్కుటమారాలే నని చంద్రబాబు నిరూపించారు. ప్రచార పటాటోపాలతో చంద్రబాబు రాష్ట్ర ప్రజలను మంత్ర ముగ్ధులను చేసారన్నది వాస్తవం. వాస్తవంగా రాజకీయ పరిస్థితులను బేరీజు వేస్తె లక్ష్మిపార్వతి పుణ్యాన కాంగ్రెస్‌కు 22 స్థానాలు వచ్చాయి. లేకుంటె మరో పది ఖచ్చితంగా తగ్గేవి. ఏది ఏమైనా మన్ను నుండి మింటి కెగసిన లక్ష్మిపార్వతి తిరిగి మన్ను కరిచారు. ప్రజలు చూపించిన అచంచల విశ్వాసాన్ని చంద్రబాబు కలలో కూడా మరువకూడదు. సమర్థపాలనే ధ్యేయంగా రాష్ట్రంలో సమర్థ ప్రభుత్వాన్ని నడిపేం దుకు కృషి చేయాలి.

నెల్లూరు వాస్తు రామచంద్ర

### షెల్టర్‌ను ఆక్రమించారు

సుబేదారుపేట వద్ద ట్రంకు రోడ్డులో విజయ పాలడైరీ సమీపాన పదేళ్ల క్రిందట లైన్స్ క్లబ్ వారు ఒక బస్‌షెల్టర్ నిర్మించారు. దాని ప్రక్కనే మంచి నీడనిచ్చే వావ్వి చెట్టు కూడా వుండింది. కాని ఆ షెల్టర్ వద్ద టౌన్‌బస్సులు ఆగవు. ప్రయాణీకులు గుమికూడరు. టాక్సీల వాళ్లు ఆ బస్సు షెల్టర్‌ను ఆక్రమించి అడ్డంగా కారులు పెట్టుకొని వుంటారు. వీరి ప్రమేయంతో షెల్టరుకు రెండు ప్రక్కలా బంకులు కూడా వెలిసాయి. ఎండలు మండే ఈ కాలంలో టౌన్ బస్సుల కోసం ఎదురు చూస్తూ ఈ సెంటర్‌లో నిలబడేందుకు కాసింత స్థలం లేదు. ఈ షెల్టర్‌ను దురాక్రమణ నుంచి కాపాడ వలసిన బాధ్యత ట్రాఫిక్ పోలీసుల మీద వుంది.

## జనవాణి

నెల్లూరు కె. పూర్ణచంద్రరావు

### కావలి డిపోలో సౌకర్యాలు కల్పించండి

గతంలో కావలి డిపో నుండి పుణ్య స్థలమైన కంచికి, అరోనికి బస్సులు నడిచేవి. కాని ఈ రెండు సర్వీసులను ఎందువల్లో రద్దు చేసారు. కావలి నుంచి రాజమండ్రికి వెళ్లె ప్రయాణీకుల సంఖ్య ఎక్కువగా వుంటుంది. రద్దీకి తగ్గట్టుగా ఒక బస్సు కూడా లేదు. కావలి డిపోలో కంప్యూటర్ సౌకర్యం వుంది. దాన్ని ప్రయాణీకుల కోసం వుపయోగించాలి. కావలి డిపోలో ప్రజల సుక్కపోతను అధికారులు గమనించి సీలింగ్ ఫ్యాన్లు ఏర్పాటు చేయమని మనవి.

కావలి కె. సుజాత నాగరాజారావు

### రైల్వే సమస్యలు ఎమ్పీ తీర్చాలి!

65 వేల ఓట్ల మెజారిటీతో నెల్లూరు ఎమ్పీగా ఎన్నికైన శ్రీమతి పనబాక లక్ష్మి గారికి అభినందనలు. నెల్లూరు రైల్వే ప్రయాణీకులు అనేక కష్ట నష్టాలు ఎదుర్కొంటున్నారు. కొచ్చిన్, మంగళ ఎక్స్‌ప్రెస్‌లను నెల్లూరు స్టేషన్‌లో ఆపడం లేదు. రిజర్వేషన్ కౌంటర్‌ను మరింత ఆధునీకరించాలి. స్టేషన్‌లో ప్రాథమిక సౌకర్యాలు కల్పించాలి. ఈ విషయంలో కొత్త ఎమ్పీ తగిన శ్రద్ధ వహించాలని మనవి.

నెల్లూరు వి. వెంకటేశ్వర రావు
(జిల్లా రైల్వే యూజర్స్ అసోసియేషన్)

### కాంగ్రెస్ వైఫల్యానికి కారణాలు యివే!

కాంగ్రెస్ పార్టీకి లోకసభ ఎన్నికల్లో ఎదురుదెబ్బ తగిలింది. దీనికి ఎన్నో కారణాలున్నాయి. పి.వి. నరసింహారావు ప్రవేశపెట్టిన ఆర్థిక సంస్కరణలను పెలువురు ప్రశంసిస్తున్నారు గాని పట్టపల్లె దేశంలో

కొరవ 10 పేజీలో

ఆర్‌టిఓ హెచ్చరిక

# ప్రమాదం జరిగితే పర్మిట్, లైసెన్స్‌లు రద్దు !

చాలా రోజుల తరువాత నెల్లూరు ఆర్టీఓ జయకుమార్ రెడ్డికి పత్రికల వాళ్ళు గుర్తొచ్చి 13 తేది పిలిపించి మరీ మాట్లాడారు. ఐటీవల నలుగురి ప్రాణాలు బలిగొన్న మూడు టౌన్ బస్సుల పర్మిట్లు రద్దు చేస్తున్నట్లు చెప్పారాయన. ఈ మూడు బస్సుల డ్రైవర్ల లైసెన్సులు కూడా రద్దు చేసి పారేశారట. బాలాజీ నగర్ ప్రాంతంలో జరిగిన బస్సు ప్రమాదంలో డ్రైవరు తప్పులేక పోయినా పర్మిట్‌ను రెండునెలలు రద్దు చేసారట. ఈ నెల 10 తేది కె.వి.ఆర్. పెట్రోల్ బంకు వద్ద యాక్సిడెంట్ చేసిన బస్సు పర్మిట్ రెండు నెలలు మాత్రమే కాన్సిల్ చేసారట. ఒక బస్సు నిర్దేశించిన రూట్‌లో తిరగడం లేదని, మరో బస్సు కండిషన్‌లో లేదని వాటి పర్మిట్లు రద్దు చేసినట్లు ఆర్టీఓ వివరించారు. ప్రమాదాలపై తాను మెతక వైఖరి వహించడం లేదన్నారు. ఏ బస్సు యాక్సిడెంట్ చేసినా కఠిన చర్యలు తీసుకొంటానన్నారు. ప్రమాదం చేసిన డ్రైవర్లకు ఆర్టీసీలో ఉద్యోగాలు రావని, ప్రైవేట్ డ్రైవర్లను ఆర్టీసిలో శిక్షణ ఇప్పించేందుకు రంగం సిద్ధం చేశామన్నారు.

> ఇపు ఎడైనా భయపడతారా బస్ డ్రైవర్లు?

### ఆటో నగర్‌లో ప్రమాదం

నెల్లూరు ఆటో నగర్‌లోని ఒక ఆటోమొబైల్ వర్క్‌షాప్‌లో 11 తేది తెల్లవారు జామున ప్రేలుడు సంభవించింది. గ్యాస్ సిలిండర్ లీక్ అయ్యి ప్రేలిపోవడంతో ప్రసాద్ ఆటోమొబైల్ గ్యారేజిలోని రెండు కార్లు దగ్ధమయ్యాయి. ఫైరింజన్ వెళ్లి మంటలు ఆర్పింది. గ్యారేజిలో పనిచేస్తున్న ఇద్దరికి స్వల్పంగా వళ్లు కాలింది.

### అధికారులకు కలెక్టర్ అభినందన!

పార్లమెంటు ఎన్నికలు ఆదర్శ వంతంగా సజావుగా నిర్వహించడానికి సహకరించిన అసిస్టెంట్ రిటర్నింగ్ అధికారులు, ప్రిసైడింగ్ అధికారులు, పోలింగ్, కౌంటింగ్ సిబ్బంది, రెవిన్యూ అధికారులను జిల్లా కలెక్టర్, డాక్టర్ డి. సాంబశివ రావు అభినందించారు. పోలింగ్, కౌంటింగ్ శాంతియుత వాతావరణంలో ఎటువంటి అవాంఛనీయ సంఘటనలు జరగకుండా పోలీసు యంత్రాంగాన్ని నడిపించిన ఎస్పీగిరిని, సిబ్బందిని ప్రత్యేకంగా అభినందించారు.

ఎపిసి మార్కెటింగ్ అధినేత కొండా శేఖర్ రెడ్డి, నీరజల వివాహం 9 తేది నెల్లూరు కస్తూరి దేవి విద్యాలయంలో జరిగింది.

## సణుగుడు

- ప్రసన్న నిఘంటువులో పరువు సిగ్గువంటి పదాలు లేవా?
- ఆర్‌డిఓ గారు మన్నించాలి – మేము వ్రాసింది తప్పు కాదనే మా నమ్మకం!

నల్లపరెడ్డి ప్రసన్న కుమార రెడ్డి గారు అత్త పైట చెంగు వదిలి, అల్లుడి పంచె చెరగు పట్టుకోవడానికి మహా తాపత్రయ పడుతున్నారు. కౌంటింగ్ ముగిసిన ప్రక్క క్షణం నుంచి ఆయనకు చంద్రబాబు కలలో గానడం మొదలు పెట్టారు; లక్ష్మీపార్వతి పేరెత్తితే కంపరం కల్గుతున్నది. అది వైష్ణవాలయం మైతే – ఇది శివాలయం; అక్కడ చక్కెర పొంగలి, దద్జనాలు – ఇక్కడ విబూది, రుద్రాక్షమా[illegible]; అక్కడ అధికారపు తీ[illegible] – ఇక్కడ అయోమయపు వె[illegible].

అటుమా[illegible] పదవీ ప్రాపకం, ఇటు చూస్తే పార్[illegible]... ఎటూతేగుటో సమస్య తగిలింది పాపమా రాజకీయ విద్యార్థికి. నల్లపరెడ్డి శ్రీనివాసుల రెడ్డి గారికి నిజమైన కుమారుడు కాబట్టి, అధికారపు గాలివాలున తేలిపోవుటే బెస్టురూట్ అని భావించి నట్లున్నారు. తనొక్కరూ పోవడానికి బిడియం వేసిందేమో – పార్వతీదేవిని తనతో తరలి రమ్మని లేఖా సందేశం పంపించాడు.

> డోలేంద్ర

అయితే నాకొక పెద్ద అనుమానం – ప్రసన్న కుమార రెడ్డి డిక్షనరీలో పరువు, మర్యాద, సిగ్గు, బిడియం వంటి పదాలు వున్నాయా లేక మిస్ అయిపోయాయా అని! అవి వుండి వుంటే ఆయనిప్పుడు ఒక రైలు దిగి

కొరవ 7 పేజీలో

వివేకానందరెడ్డి విమర్శ

# నా ఫిర్యాదు సక్రమమే – ఆర్‌డిఓ నివేదికే వక్రం!

పార్లమెంటు ఎన్నికల ఖర్చు కోసం మంత్రి టి. రమేష్ రెడ్డికి మునిసిపల్ కమీషనర్ ఇతర అధికారులు కలిసి లక్షల రూపాయలు ముడుపులు చెల్లించారని తాను చేసిన ఫిర్యాదు విషయమై ఆర్డీఓ కుమారి టి.కె. శ్రీదేవి నివేదికను సరిగా రూపొందించ లేదని మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి ఆరోపించారు. రెండు నెలల్లో పదవీ విరమణ చేయనున్న, మునిసిపల్ కమీషనర్‌పై సానుభూతి, మానవతా దృక్పథంతో నివేదిక సరిగా రూపొందించ లేదని; అధికారంలో

> నెల్లూరు సంగతులు

వున్న పార్టీ నాయకుల వత్తిడి కూడా ఆర్డీఓపై పడిందని, తాను చేసిన ఆరోపణలకు ఆధారాలు వున్నప్పటికీ, వాటిని విస్మరించారని వివరించారు. పార్లమెంటు ఎన్నికల నోటిఫికేషన్ విడుదలైన తరువాత మంత్రికి ఎన్నికల నిధులు సమకూర్చేందుకు పదిశాతం కమీషన్ వంతున దండి 49 లక్షల రూపాయలకు బిల్లులు మంజూరు చేసి కాంట్రాక్టర్లకు చెక్కులు పంపిణీ చేశారు. తాను ఎన్నికల కాలంలో 500 ఇళ్లకు పన్ను అసెస్‌మెంట్లు చేశారని ఫిర్యాదు చేస్తే ఆర్డీవో విచారణలో అవి 600గా తేలినట్లు చెప్పారు. మార్కెటింగ్ శాఖ [illegible] వచ్చిన 12.40 లక్షల [illegible]పాయలు కరెంటు అకౌంటులో వేసి కంట్రాక్టర్లకు చెక్కులు ఇచ్చారని, నిధులు సేకరించేందుకు సిబ్బందితో సమావేశం ఏర్పాటు చేసిన విషయం ఆర్డీవో ముందు కమీషనర్ అంగీకరించారని వివేకానంద రెడ్డి చెప్పారు. ఆర్డీఓ నివేదిక, దానిపై తన అభిప్రాయాన్ని జతపరచి మళ్లీ ఎన్నికల కమీషనర్ శేషన్ దృష్టికి తీసుకుపోనున్నట్లు వివరించారు.

### క్లబ్‌పై పోలీసుదాడి

క్లబ్బులు, వ్యభిచార గృహాల జోలికి అసలు వెళ్లని నెల్లూరు పోలీసులు 12 తేది ఆ సాహసం చేశారు. బుజబుజ నెల్లూరులోని ఒక క్లబ్బులో అర్ధరాత్రి తరువాత కూడా చీట్లాట ఆడుతున్నారని 47 మందిని అరెస్టు చేసి, 39 వేల నగదు, క్లబ్బులోని ఫర్నిచరు కూడా స్వాధీనం చేసుకొన్నట్లు డిఎస్పీ వెంకటేశ్వర్లు రెడ్డి చెప్పారు. క్లబ్ నిర్వాహకులు మహేంద్ర రెడ్డి, వెంగయ్య మాత్రం పట్టుబడ లేదట. క్లబ్‌పై దాడికి సి.ఐ., నలుగురు టౌన్ ఎస్.ఐ.లు, పోలీసులు దండుగా వెళ్లారు. టౌన్‌లో క్లబ్బుల ఆచూకి తెలియజేస్తే వాటి పనిపడతారట. బుజబుజ నెల్లూరు క్లబ్బులో శ్రుతిమించిన వ్యవహారాలపై కొందరు నర్సింగ్ స్కూలు విద్యార్థినులు ఎస్పీకి ఫిర్యాదు చేస్తే తరువాత ఈ దాడికి పోలీసులు సాహసించారని వినికిడి.

### అద్భుత శాస్త్రం హిప్నటిజం

యాంత్రిక జీవనంలోని ఒత్తిడులు నియంత్రించి అద్భుత శక్తుల్ని వెలికితీసి మేధో పరిణితికి ఉపకరించే అత్యుత్తమ ఆధునిక శాస్త్రం హిప్నటిజమని ప్రముఖ హిప్నటిస్ట్ పి.వి.ఎన్. రావు చెప్పారు. 12 తేది దొడ్ల పద్మావతమ్మ మహిళా గ్రంథాలయంలో సింహపురి సాహిత్య సాంస్కృతిక

కొరవ 11 పేజీలో

# మనసు స్టూడియోలో కళ్లకెమరాతో తీసిన సామాజిక కథల పుస్తకం

1820-22 సంవత్సరాల ప్రాంతాలలో శ్రీ వెన్నెల కంటి సుబ్బారావు సమకాలీన సగటు మనిషి జీవిత చిత్రాన్ని వ్యంగ్యంగా, నిశితంగా కథా చిత్రాలుగా చిత్రీకరించి, పురాణాం తర్గత సంవిధానానికి తిరుగుబాటు దారుడుగా నిలబడిన నేపథ్యంలో కథను గురించి మొట్టమొదట చర్చ ప్రారంభమైంది. ఆ తర్వాత, తెలుగు కథ 'రాశి' పెరిగినా వాసి పెరగక పోవడం వల్ల ఏటా కొన్ని వందల కథలు రచయితల కార్ఖానా ల్లోంచి తయారవు తున్నప్పటికీ, పానుగంటి 'గానుగచెట్టు' భాసుడు 'లాజరగ' అంతా 'గాలివాన', 'నీలి' కథల్లాగా పాఠకుల మనోఫలకాలపై నిలువలేక 'విస్మృతా' లయ్యాయి.

ఈ పరిస్థితి నుంచి బయటపడి అప్పుడప్పుడే సాహితీ సంస్థలు ప్రతి యేటా ఉత్తమ ప్రమాణాలున్న కథా సంకలనాలను వెలుగులోకి తెస్తున్నాయి. సాహితీ సంస్థలు కలిసి చేస్తున్న ఈ కృషిలో వ్యక్తిగత ఒత్తిడులు, 'వర్గ' అభిమానాలు చోటు చేసుకుంటున్న దృష్ట్యా కొందరు సంపాదకులకు ఇదెంతో సంతోషించ దగ్గ పరిణామం. స్త్రీవాద రచయిత్రులు, 'అద్వైదయ 'ఏకాగ్రత' లోపిస్తున్నప్పటికీ గుడ్డి కంటే మెల్ల మేలుగా కొన్ని మంచి కథల్ని మనం అందుకో గలుగుతున్నాం.

> **గ్రంథ సమీక్ష**
> రచయిత
> జయంపు కృష్ణ
> సమీక్షకులు
> పాయసం సుబ్రహ్మణ్యం
> ప్రతులకు
> శ్రీమతి రాజేశ్వరి
> రాఘవ కోచింగ్ సెంటర్
> దాకలి వీధి, నెల్లూరు - 1
> వెల: రూ.30/--

అయితే 1914లో త్రిరంగ, 1920 లో సాహితి, 1922లో శారద, 1924లో భారతి, 1930లో ప్రబుద్ధాంధ్ర, 1936లో ప్రతిభ వంటి పత్రికలకు లేనిసాంకేతిక, ఆర్థిక వనరులు ఇప్పటి పత్రికలకున్న దృష్ట్యా – సంపాదకులు కథా సంవిధానం వైపు దృష్టి నిలిపి 'విష్కృతికత' వైపు మొగ్గు చూపిస్తే ఇప్పటికి మించి ఉత్తమ ప్రమాణాలు గల కథలు వెలుగులోకి రావడానికి అవకాశాలు మెరుగ్గా వుంటాయన్నది వారి అభిప్రాయం.

ఈ పరిస్థితుల్లో, ఈ మానసిక సమతుల్య స్థితిని సాధించిన కొందరు రచయితలు సమాజాన్ని ఆకళింపు చేసుకుని చక్కని కథా సంపుటాల్ని ఈ మధ్య మన మధ్యకు తెచ్చారు.

కొరవ 11 పేజీలో

# మోటారు రిపేరుకు గతిలేక నీళ్ళకోసం అల్లాడిస్తున్నారు!

గూడూరులో గత వారం రోజులుగా కొళాయిల్లో నీటి సరఫరా లేక ప్రజలు నానా అవస్థలు పడుతున్నారు. నీటి సరఫరా సరిలేక పోవడం వల్ల టౌన్‌లోని పలు హోటళ్లు మూసివేసారు. మునిసిపాలిటీ అధికారుల నిర్లక్ష్యం, ప్రజా సమస్యల పట్ల స్పందన లేని ప్రజా ప్రతినిధుల తీరువల్ల ఈ దుస్థితి దాపురించింది. మంచినీటి సరఫరా జరిగే పిందూరు హెడ్ వాటర్ వర్క్స్ వద్ద

> **గూడూరు నీటి కటకట మునిసిపల్ చేతకాని తనమే!**

మోటారు చెడిపోవడంతో అంతరాయం కలిగిందని అధికారులు కుంటిసాకు చెప్తున్నారు. విద్యుత్ సరఫరా సరిలేనందువల్ల సమృద్ధిగా నీళ్ల సరఫరా చేయలేక పోతున్నట్లు చెబుతున్నారు. తూర్పు వీధి, పూలతోట, బజారు వీధి, కుమ్మర వీధి, మిట్టపాళెం ప్రాంతాల్లో ఇటీవల కొళాయిల్లో మురికినీళ్ల వస్తున్నాయి. దీనివల్ల టౌన్‌లో అతిసార వ్యాధి కూడా ప్రబలింది.

తూర్పు గూడూరు రిజర్వాయరుకు నీటి సరఫరా చేసే హెడ్ వాటర్ వర్క్స్ వద్ద రెండు మోటార్లు వున్నా వాటిని సరిగా వినియోగించు కోకపోవడం వల్లనే సమస్యలు వుత్పన్న మవుతున్నాయనడం నిజం గతంలో పురపాలక నేతలు నీటి సరఫరాకు ఇబ్బంది లేకుండా విద్యుత్ సరఫరా చేయమని విద్యుత్ అధికార్లను వప్పించేవాళ్లు. కాని ఇప్పటి ఛైర్మన్, వైస్ ఛైర్మన్‌లు నీటి విషయమై అసలు పట్టించు కోకపోవడం, పుబువురు అధికారులు అక్రమ దొంగ కొళాయిలను అమ్ముకోవడంలో నిమగ్నమై వుండడంతో నీళ్లకై గూడూరు ప్రజలు అల్లాడిపోతున్నారు.

## నరసింహస్వామి కొంపముంచారు

పెంచలకోనలోని పెంచలనరసింహ స్వామి తిరునాళ్లు వైభవంగా ముగిసాయి. 4 లక్షల మందికి పైగా భక్తులు తిరునాళ్లకు తరలి వచ్చారని అంచనా!. వీరిలో అత్యధికులు కడప జిల్లా వాసులు కావడం విశేషం. తిరునాళ్లు జరిగినన్ని రోజులూ రాపూరు ఎమ్మెల్యే ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి, ఆత్మకూరు ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్య నాయుడు, దేవస్థానం పాలక వర్గం మాజీ ఛైర్మన్ పాపకన్ను జయచంద్రా రెడ్డి తమ అనుచర గణంతో గుడి ముందు తిష్ట వేశారు. వారు దేముడి సేవ చేయడం మాటేమో గాని, తమ అనుచరు లందరికి దేవస్థానం ఖర్చుతో భోజనాది ఏర్పాట్లు చేసుకున్నారు. దీని వల్ల నరసింహ స్వామి ఖజానాకు 2 లక్షల రూపాయలు పైగా గండిపడినట్లు విశ్వసనీయంగా తెలిసింది.

కోనలో ప్రత్యేకంగా వాటర్ ట్యాంకు కట్టబట్టి ఈసారి మంచినీళ్లకై భక్తులకు తిప్పలు తప్పాయి. కానీ రాపూరు – పెంచలకోన మధ్య వున్న రోడ్డు మరమ్మత్తులు చేయించక పోవడంతో నరసింహస్వామిని దర్శించక ముందే భక్తులకు వళ్లుహూనమై నీరసపడిపోయారు.

## కావలి బార్ అసోసియేషన్

కావలి బార్ అసోసి యేషన్ సర్వసభ్య సమావేశం 12 తేది కావలిలో జరిగింది. ఈ సందర్భంగా జరిగిన కార్యవర్గ ఎన్నికల్లో అధ్యక్షునిగా విశ్వేశ్వర నాయుడు, కార్యదర్శిగా సయ్యద్ కలీమ్ అహ్మద్ రోజ్‌దార్ ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. కార్య నిర్వాహక కమిటీ సభ్యులుగా శ్రీమతి సత్యవతి, కె. శ్రీనివాసులు రెడ్డి, ఎం. బాబూ రావులను ఎన్నుకొన్నారు.

## ఈ రోడ్డు పై రాళ్లు పరిపించండి బాబు!

కావలి టౌన్‌లో రోడ్లు అత్యంత అధ్వాన్న స్థితిలో వుంటాయి. పేరుకు మునిసి పాలిటియే గాని నిధుల లేమితో

కొరవ 8 పేజీలో

# రాపూరులో మళ్ళీస్మగ్లింగ్!

అదుపుచేస్తే దెబ్బ కొట్టేందుకు రాపూరు ఎర్రచందనం స్మగ్లర్లు ఎప్పుడూ రెడీగా వుంటారు. పత్రికల్లో తరచూ వార్తలు రావడంతో అటవీశాఖాధికారులు అప్రమత్తంగా వ్యవహరించడం వల్ల రాపూరులో ఇటీవల చందనం స్మగ్లింగ్ బాగా తగ్గింది. స్మగ్లింగ్‌ను అరికట్టామన్నా భావనలో అధికారులు మౌనం వహించడంతో ఇటీవల స్మగ్లింగ్ మళ్లీ ఎక్కువయ్యింది. కొండ క్రింద గ్రామాల్లో ఒక్కొక్క దుంగ వందరూపాయిలకు కొని వీటిని బయట ప్రాంతాలకు తరలించి వేలాది రూపాయలకు అమ్మి సొమ్ము చేసుకొంటున్నారు. చెక్‌పోస్టుల్లో సిబ్బంది సరిగా వుండక పోవడం, వున్నవారు వుదాసీనంగా డ్యూటీలు నిర్వహిస్తుండటంతో రాపూరులో ఎర్రచందనం స్మగ్లర్ల వ్యాపారం మళ్లీ మూడు పువ్వులు ఆరు కాయలుగా విరాజిల్లుతూంది.

## సాయిబాబా గుడిలో దొంగతనం!

గూడూరు సాయిబాబా గుడిలో 10 తేది దొంగతనం జరిగింది. దొంగలు గుడి వెనుక వైపు తలుపులు పగులగొట్టి, హుండీని బయటకు తీసుకెళ్లి పోయారు. భక్తులు కానుకల రూపంలో వేసిన దాదపు 15 వేల రూపాయల నగదు దొంగతనం జరిగి వుండవచ్చని నిర్వాహకులు పోలీసులకు ఫిర్యాదు చేశారు. ప్రతి 15 రోజుల కొకసారి హుండీలో డబ్బులు లెక్కపెట్టేవారట; లెక్కకు ముందే తస్కరం చేశారని గూడూరు రూరల్ పోలీసులు చెప్పారు.

## కావలి చలివేంద్ర

కావలిలోని అభ్యుదయ సేవా సంస్థ పొట్టి శ్రీరాములు సెంటర్‌లో చలివేంద్రాన్ని ప్రారంభించింది.

# పంచాయితీఆఫీసును అమ్మేసినాఆశ్చర్యంలేదు!

ఆత్మకూరు పంచాయతీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ యధేచ్ఛగా పంచాయితీకి సంబంధించిన స్థలాలను అమ్మి పారేస్తున్నారు. ఇ.ఓ. వల్లే టౌన్‌లోని రద్దీ స్థలాల్లో ఆక్రమణలు పెచ్చు పెరిగి పోయాయనడం అతిశయోక్తి కాదు. ఆ మధ్య టౌన్‌లో అక్రమంగా బంకులు పెట్టుకొనేందుకు అనుమతిచ్చిన ఇ.ఓ. ఇప్పుడు ముడుపులు అందుకొని బిల్డింగులకు కూడా అనుమతి నివ్వ నారంభించారు. ఆత్మకూరు ఎల్.ఆర్. పల్లి కూడలి సెంటర్‌లో పదిరోజుల క్రితం చెర్లో నుంచి నీరు వచ్చే పంట కాల్వను ఆక్రమించి పర్మినెంటు బిల్డింగును కడుతున్నారు. ప్రభుత్వ స్థలంలో ధైర్యంగా ఇంటి నిర్మాణం పూర్తి చేయడానికి ఎన్నివేలు ఇ.ఓ.కు కైంకర్యం చేశాడో మరి. మరో సంవత్సరం గడిస్తే ఆత్మకూరులో ఇ.ఓ. గారు పంచాయితీ ఆఫీసునే అమ్మేసినా ఆశ్చర్య పడాల్సిన అవసరం లేదు. జిల్లా పంచాయితీ అధికార్లకు ఈ విషయం పట్టదా?

## అధికార పార్టీ నాయకుల చేతుల్లో ఆటబొమ్మలు!

అనంత సాగరం మండలంలోని పోలీసులు అధికార తెలుగు దేశం పార్టీ నాయకుల చేతిలో గులాములుగా మారి వున్నారు. దీనివల్ల అధికార పార్టీ నాయకులు ప్రతిపక్ష పార్టీ కార్యకర్తలపైనే దాడులు చేసి తిరిగి వారి పైనే కేసులు బనాయిస్తున్నారు. దీనికి ఆత్మకూరు డి.ఎస్.పి. వత్తాసు పలకడంతో అధికార పార్టీకి ఎదురు లేకుండా పోతున్నది. పార్లమెంటు ఎన్నికల పోలింగ్ సమయంలో అనంత సాగరం మండలంలోని లింగంగుంట గ్రామంలో అధికార, ప్రతిపక్ష పార్టీ కార్యకర్తల మధ్య ఒక ఓటు విషయంలో వాదోపవాదాలు జరిగాయి. ఘర్షణ జరిగే సమయంలో పోలీసులు వచ్చి సర్ది చెప్పారు. అయితే పోలింగ్ ముగిసిన తర్వాత అధికార పార్టీ నాయకులు ప్రతిపక్ష పార్టీ కార్యకర్త ఇంటిపై దాడి చేశారు. అతను కేసు పెట్టాడు. కాని అధికార పక్షీయులు తాము కొట్టిన వ్యక్తి పైనే తిరిగి కేసు పెట్టను స్టేషన్‌కు వెళ్లారు. పోలీసులు నిరాకరించడంతో డి.ఎస్.పి. ద్వారా వత్తిడి తెచ్చి కేసును రిజిష్టరు చేయించారు. సోమశిల పోలీస్ స్టేషన్ పరిధిలోని పడమటి కంభంపాడులో రెండు నెలల క్రితం ఒక దళితుని గొర్రెలు దొంగతనం పోయి తిరిగి దొరికినా దొంగ అధికార పార్టీకి చెందినవాడు కావడంతో పోలీసులు కేసు నమోదు చేయలేదు. అధికార పార్టీ మెహర్బానీ, తమకు నజరానా వచ్చేస్తే ఎటువంటి కేసులైనా మార్చి అనంత సాగరం పోలీసులు రిజిష్టర్ చేస్తున్నారు. ఎస్పీగారూ ఒకసారి విచారించండి!

> **ఆత్మకూరు ఇ.ఓ. ఖాళీస్థలాలు వరుసబెట్టి విక్రయిస్తున్నారు!**

## పొన్నలూరు కోటారెడ్డి స్మారక అవార్డులు

గూడూరులోని పొన్నలూరు కోటారెడ్డి స్మారక ట్రస్టు ఈ యేడాది డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి, విద్వాన్ ముదివర్తి కొండమా చార్యులు, వేదాంతం సత్యనారాయణ శర్మలకు అవార్డులు ప్రకటించింది. సాహిత్య, కళా, రాజకీయ రంగాల్లో విశిష్ట సేవలు చేసినందుకు ఈ అవార్డులు వీరికి ఇచ్చారు. 23 తేది గూడూరు డి.ఎస్.ఆర్. కమ్యూనిటీ హాలులో జరిగిన అవార్డుల సభలో సినీ నటుడు జగ్గయ్య ముఖ్య అతిథిగా పాల్గొని అవార్డులు అందజేసారు. ఈ కార్యక్రమంలో వప్పు వేణుగోపాల్, సనత్ కుమార్ రెడ్డి, పొన్నలూరు కోదండ రామిరెడ్డి, వై.వి. ప్రభాకర రెడ్డి, దేవకి భాస్కర రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# వెంకయ్య పట్ల అసంతృప్తే విష్ణుపట్లఅభిమానంపెంచింది

జిల్లాలో సిపిఎం పార్టీ ప్రాతినిధ్యం వహించే ఏకైక నియోజక వర్గమైన అల్లూరులోనే ఆ పార్టీ మెజార్టీ సాధించలేక చతికిల పడిపోయింది. నెల్లూరు పార్లమెంటు పరిధిలోకి వచ్చే అల్లూరు నియోజకవర్గంలో మొన్నటి ఎన్నికల్లో కాంగ్రెసు పార్టీ 14,157 ఓట్ల ఆధిక్యతను పొందింది. గత అసెంబ్లీ ఎన్నికల్లో 1900 స్వల్ప ఓట్ల మెజార్టీతో గట్టెక్కిన సిపిఎం పార్టీ జిల్లా కార్యదర్శి జక్కా వెంకయ్య ఒకటిన్నర సంవత్సరం వ్యవధి తరువాత జరిగిన ఈ ఎన్నికల్లో 12,257 ఓట్ల మైనార్టీలో పడిపోయారు. ఈ ఎన్నికల్లో మాజీ ఎమ్మెల్యే కాటంరెడ్డి విష్ణువర్ధన రెడ్డి అవిరళ కృషి కాంగ్రెస్ ఓట్లు పెరిగేందుకు దోహదపడగా, జక్కా వెంకయ్యపై నియోజక వర్గంలో తీవ్రంగా ప్రబలిన వ్యతిరేకత మరో కారణంగా చెప్పవచ్చు. సమస్యలపై పనిచేసే శాసనసభ్యుడని చెప్పుకొనే ఈనాటి వెంకయ్య ఈమధ్య నియోజక వర్గంలో పర్యటించడమే మానేశారు. ప్రధాన సమస్యలపై స్పందించిన దాఖలే లేదు. దీనివల్ల పార్టీ కార్యకర్తలతో పాటు, సామాన్య ప్రజల్లోనూ నిరుత్సాహం ఎక్కువైపోయింది. 35 వేల ఓట్లు గల అల్లూరు టౌన్‌లో ఈసారి ఆ పార్టీ

> **అల్లూరు సిపిఎం అంత బలహీన పడడానికి కారణం అన్వేషించారా?**

తరఫున పనిచేసే తెలుగుదేశం నాయకుడే కరువయ్యారు. వున్న ఒక్క తెలుగుదేశం నాయకుడు అసలు ఎన్నికల సమయంలో ఊళ్లో లేకుండా వెళ్లిపోయాడు. అల్లూరు సిపిఎం పార్టీశాఖ అంతర్యు ద్ధాలతో సతమత మవుతున్నది. కార్యదర్శికి నోరు లేకపోతే, నోరున్న మరో నాయకుడు ఎన్నికల బూచిని చూపిస్తూ బాగా చందాలు దండుకొన్నట్లు వినికిడి.

స్థానిక సంస్థల ఎన్నికల్లో లభించిన విజయంతో విష్ణు ఎక్కడలేని వుత్సాహంతో పనిచేయ నారంభించాడు. తాను పోటీ చేసిన అసెంబ్లీ ఎన్నికల కన్నా మిన్నగా ఈసారి గ్రామ గ్రామానా తిరిగాడు. ఆయన అసెంబ్లీ ఎన్నికల్లో ఓడిపోయిన తరువాత సానుభూతి ఏర్పడి వుంది. ప్రజలు ఇప్పటికి విష్ణునే అనధికార ఎమ్మెల్యేగా భావిస్తూ వివిధ పనుల కోసం ఆయన చుట్టూ తిరుగుతున్నారు. ఓడిపోయినా బాగా ఓపిక చేసుకొని పనులు చేసిపెట్టడంతో విష్ణుపై ప్రజాభిమానం మళ్లీ మామూలై మెజార్టీ తెచ్చిపెట్టింది. కానీ మత్స్యకారుల ఓట్లు బిజెపి వైపు మళ్లడమే విష్ణుకు చికాకు తెచ్చి పెడుతున్నది. వారి వ్యక్తిగత గొడవల్లో

కొరవ 7 పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

## మండే ఎండలు

మండే ఎండలంటే ఏమిటో ప్రత్యక్షంగా అనుభవిస్తున్నారు. తల బయటపెడితే ముఖం మాడిపోతూంది. మధ్యాహ్నం సమయంలో రోడ్లలో జనసంచారమే వుండడం లేదు. ఎండుగడ్డి పోచలు ఒకదానికొకటి రాసుకొన్నా నిప్పు పుట్టేట్టుంది పరిస్థితి. ఎక్కడ చూసినా అగ్నిప్రమాదాలే. రోడ్ల ప్రక్కన కరతుమ్మ చెట్లు వున్నట్లుండి తగలబడి పోతున్నాయి. నేషనల్ హైవేపై తరచు ఇటువంటి దృశ్యాలు కన్పిస్తున్నాయి.

ఈ వారంలో నెల్లూరులో రికార్డయిన ఎండల వివరాలివి –

| | సెం.గ్రే. | ఫా.హీ. |
|---|---|---|
| 11తేది | 43.8 | 110.8 |
| 12 | 44.9 | 112.9 |
| 13 | 44.9 | 112.9 |
| 14 | 43.8 | 110.8 |
| 15 | 43.9 | 111.0 |
| 16 | 44.9 | 113.0 |

## చింతలాత్మకూరులో చితుకుల మంట

వేసవి ప్రతాపానికి తొలిగా ...రైపోయిన గ్రామం – చింతలాత్మకూరు. కలువాయి మండలంలోని ఈ గ్రామంలో 14 తేదీ జరిగిన అగ్ని ప్రమాదం చాలా ఘోరమైనది. పూరిపూరి చితుకుల మంటగా మారిపోయింది. రాజమ్మ అనే ఆమె వంట చేస్తున్నప్పుడు గుడిసె పై నిప్పు అంటు కున్నదట. వాయు దేవుడు, అగ్ని దేవుడులకు ఆ మంటే మహా స్వాహా అయింది. ఇంటి తర్వాత ఇల్లుగా మంటలు వ్యాపించి 120 ఇళ్లు పరశురామ ప్రీతి చెందాయి. మంటలార్పడానికి గ్రామంలో నీళ్లు లేవు. ఫైరింజన్ రావడం ఆలస్యమైంది; వచ్చిన తర్వాత వారు నీళ్ళ కోసం ప్రక్క గ్రామం వెళ్లి రావలసి వచ్చింది. ఈ లోగా బొటనార్పు మొండి గోడలు మాత్రం మిగిలాయి.

వందల పుట్ల ధాన్యం, డబ్బు, ఇళ్ళలోని సామాను, గుడ్డ పేలికలతో సహా సర్వం బూడిదైనాయి. బంగారు ... కరిగిపోయాయి. గ్రామం ... ఎత్తు అనాథలై పోయారు. కోటి రూపాయల వరకు నష్టం. పాపమా గ్రామస్థుల శోకం ఓదార్చలేనిది. వండుకొనే గిన్నెలు, తిండి గింజలు కూడా లేని దరిద్రులై పోయారు ఒక్క గంటలోపల. దివాలా కోరు రాష్ట్ర ప్రభుత్వం వారిని ఏ రూపంలోనూ ఆదుకోవడం లేదు.

* * *

14 తేది మధ్యాహ్నం నెల్లూరు టౌన్‌లో పెన్న నది పొర్లుకట్ట దగ్గర ఒక ప్రమాదం. 58 గుడిసెలు అగ్నికి ఆహుతై పోయాయి. 5 లక్షల ఆస్తి నష్టం. ఇళ్ళలోని వారు ఐదుగురు కాలిన గాయాలతో ఆస్పత్రి పాలైనారు. ఇక్కడా వంటింటి నిప్పే ప్రమాదానికి కారణం. సమయానికి నెల్లూరులో ఫైరింజన్లు లేవు. వేరే చోట నిప్పు ఆర్పడానికి వెళ్ళాయట. అందువల్ల కోట నుంచి తెప్పించారు. అవి వచ్చేటప్పటికి బూడిద మాత్రం మిగిలింది.

* * *

ఆత్మకూరు టౌన్ తూర్పు వీధిలో 16 తేది రెండిళ్ళు తగలబడ్డాయి. కరెంట్ షార్ట్ సర్క్యూట్ కారణమట. 50 వేల డబ్బు, 20 సవర్ల నగలు హారతి కర్పూరం.

ఆర్పని పొయ్యిలు, సిగరెట్, బీడీ ... ఆకలి అగ్ని ప్రమాదాలకు ప్రధాన కారణం. ఎండాకాలం ముగిసే వరకు నీళ్లు దగ్గర పెట్టుకొని వుండడం అందరికీ మంచిది.



## అకుతోట హత్యాయత్నం

ముత్తుకూరు రోడ్డులోని అకుతోట హరిజనవాడలో 14 తేది ఇద్దరిపై హత్యాయత్నం జరిగింది. సర్వేపల్లి ఎమ్మెల్యే శ్రీ సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి శిష్యుడు పాముల రమణయ్య, అతడి స్నేహితుడు వెంట్రుబంగు రమణయ్యలను దాడిచేసి కత్తులతో పొడిచారు. కాని, అదృష్టం బాగుండి ఇద్దరూ బ్రతికారు. మద్రాసు ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు.

దీనికి ప్రతీకారంగా ప్రక్కరోజు పూటుకూరు ఆదిమూర్తి, లక్ష్మయ్యలకు సంబంధించిన వారి ఇళ్లపై దాడి జరిగింది.

అకుతోటలో రాజకీయ వైషమ్యాలు ఇంత హింసా రూపం ధరించడం విచారకరం. ఎవరో ఒకరు జోక్యం చేసుకొని ఈ నిప్పు ఆర్పలేరా?

## గోపాలకృష్ణయ్యకు డైరీ చైర్మన్ గిరి

నెల్లూరు డైరీ పర్సన్ ఇన్‌చార్జిగా తెలుగు నాయకుడు శ్రీ ఎ. గోపాలకృష్ణయ్య నియమితులైనారు. ఈ ... లో ఏ మాధుర్యం వుందో తెలి... – కాని, రెండు దశాబ్దాల నుంచి దాన్ని వదలి వుండ లేకపోతున్నారు చౌదరిగారు. మధ్యలో కాంగ్రెస్ ప్రభుత్వం వస్తే విశ్రాంతి, తెలుగుదేశం రాగానే కుర్చీ – మ్యూజికల్ ఛైర్స్ ఆట వలె వుంది.

ఈ కుర్చీ కోసం పాపం బెజవాడ సురేష్ రెడ్డి చాలా ఖర్చుపెట్టి, శ్రమపడి ఎన్నికలకు సిద్ధమైనారు. నోటి దగ్గరకు వచ్చిన తర్వాత చేతి నుంచి జారిపోయింది.

నెల్లూరులో ప్రైవేటు డైరీలు చాలా వస్తున్నాయి. వాటి పోటీకి తట్టుకొని సహకార డైరీని చౌదరిగారు ఎట్లా నిలబట్టబోతారో చూడాలి.

## డాక్టర్ అనిల్‌కుమార్‌కు అంతర్జాతీయ అవార్డు

నెల్లూరు డయబెటిక్ స్పెషలిస్ట్ డాక్టర్ అనిల్ కుమార్ రెడ్డికి డెన్మార్క్‌లో జరిగిన అంతర్జాతీయ డయబెటిక్ మహాసభలో యువ శాస్త్రవేత్త అవార్డు బహూకరించారు. మధుమేహ వ్యాధి వారసత్వంగా వచ్చే విషయమై నెల్లూరు జిల్లాలో తాను కనుగొన్న విషయమై అనిల్ సమర్పించిన పరిశోధనా పత్రానికి ఈ అవార్డు లభించింది.

దాదాపు 100 దేశాల నుంచి 350 మంది డయాబెటిస్ నిపుణులు పాల్గొన్న ఈ సదస్సులో భారతదేశం నుంచి ముగ్గురు డాక్టర్లు మాత్రమే పాల్గొన్నారు; అందులో అనిల్ ఒకరు. ఆయనకు మా అభినందనలు.

## నీటికరువు రాదు

నెల్లూరు టౌన్‌లో ఎటువంటి పరిస్థితులలోనూ మంచినీటి ఎద్దడి ఏర్పడ కుండా మునిసిపాలిటీ ... చర్యలు తీసుకొంటున్నదని మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకా నంద రెడ్డి చెప్పారు. 17 తేదీ మునిసిపల్ ఆఫీసులోని వాటర్ ట్యాంకుల క్రింద విలేకరుల సమావేశం ఏర్పాటు చేసి పలు విషయాలు వివరించారాయన. మునిసిపాలిటీ పరిధిలో ప్రస్తుతం ఒక హెడ్ వాటర్ వర్క్స్, 22 మినీ పథకాల నుంచి 95 లక్షల గ్యాలన్ల నీరు రోజూ సరఫరా చేస్తున్నారట. ఈ యేడాది వర్షాభావ పరిస్థితులు, ఎండలు మరీ తీవ్రంగా వుండడంతో భూగర్భజలాలు ఇంకిపోయి అక్కడక్కడా స్వల్ప నీటి సమస్య ఏర్పడినా దాన్ని పరిష్కరిస్తామన్న ఆత్మవిశ్వాసం వ్యక్తం చేశారు. నీటి సమస్య పరిష్కారానికి ఒక యాక్షన్ ప్లాన్‌ను మునిసిపాలిటీ రూపొందించిం... ఫత్తేఖాన్ పేటలోని వాటర్ వర్క్స్ పథకం వారంరోజుల్లో పనిచేయడం ప్రారంభిస్తుందని, దీనివల్ల ఆ పరిసర ప్రాంతాల్లో 6 లక్షల గ్యాలన్ల నీరు సరఫరా అవుతుందన్నారు. చిన్నబజారు, పెద్ద బజారు ప్రాంతాలకు నేరుగా నీటిని సరఫరా చేసేందుకు సంతపేటలోని ఆంజనేయ స్వామి గుడి వద్ద కొత్తగా బోర్‌వెల్ వేస్తున్నారు. దీనివల్ల 3 లక్షల గ్యాలన్ల నీరు ఆ ప్రాంత ప్రజల వినియోగానికి వస్తుంది. జకీర్‌హుసేన్ నగర్‌లో పెన్నలో రెండు బావులు ఏర్పాటు చేసి అక్కడ నుంచి 3 లక్షల గ్యాలన్ల నీరు స్టోన్‌హౌస్ పేట రిజర్వాయరుకు పంపనున్నట్లు చెప్పారు.

ఈ పనులన్నీ 15 రోజుల్లో పూర్తి చేసేస్తారు. 16 తేది మంచినీటి సమస్య పరిష్కారానికి ఏర్పాటు చేసిన ప్రత్యేక సమావేశంలో వార్డు సభ్యులు మరో 126 బోర్ వెల్స్ కావాలన్నారని, వీటికోసం 32 లక్షల రూపాయల నిధులు అవసర మవుతాయని వివరించారు. ప్రస్తుతం టౌన్‌లో చెడిపోయి వున్న 190 బోర్‌వెల్ మరమ్మత్తులకు వెంటనే 3 లక్షల రూపాయలు ప్రభుత్వం మంజూరు చేయాలని కోరారు.

నీటి సమస్యను తక్షణం ఎదుర్కొనేందుకు 18 తేదీ నుండి తీ మునిసిపాలిటీ బాడుగకు ట్రాక్టర్లు తీసుకొని, రోజుకు 96 ట్రిప్పుల నీటిని డ్రమ్ముల ద్వారా శివారు ప్రాంత ప్రజలకు సరఫరా చేస్తుంది. టౌన్‌లోని కొళాయిలు ప్లాట్‌ఫారంల నిర్మాణానికి తక్షణం 2 లక్షల 60 వేలు వెచ్చించే పనికి టెండర్లు పిలిచి, వారం రోజుల్లో ఆ పని పూర్తి చేయించ నున్నారు. ప్రస్తుత పరిస్థితుల్లో మంచినీటి సమస్యను ఎదుర్కొనేందుకు కోటి 30 లక్షల రూపాయలు తక్షణం కేటాయించాలని వివేకానంద రెడ్డి ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. సోమశిల జలాలు నెల్లూరు చెరువుకు వదలాలని కూడా కోరారాయన.

## ఆంధ్రభూమి విలేఖరికి సతీవియోగం

నెల్లూరు ఆంధ్రభూమి దినపత్రిక విలేఖరి శ్రీ ఎస్.ఎం.ఎ. రహీమ్ సతీమణి శ్రీమతి బీబి (36) హఠాత్తుగా మరణించారు. స్వల్పంగా జ్వరం వచ్చిందట. ఆస్పత్రిలో చేర్పించారు. అదుపు కాలేదు. ప్రాణం విడిచారు. ఆమెకు ఇద్దరు పిల్లలు.

జీవిత భాగస్వామిని కోల్పోయిన రహీంకు మా సానుభూతి.

## కలవకూరు శేషురెడ్డి కాలధర్మం

కెవిఆర్ సోదరులలో సజీవుడుగా వుండిన ఏకైక వ్యక్తి శ్రీ కలవకూరు శేషురెడ్డి కాలధర్మం చెందారు. బస్సుల నిర్వహణలో స్వర్గీయ కెవిఆర్‌కు చేదోడు, వాదోడుగా వుండేవారాయన. సౌమ్యుడు, వివాద రహితుడు. బస్సుల జాతీయం తర్వాత విశ్రాంతిగా కాలం గడిపారు. తన అన్న తమ్ముళ్ళందరూ దాటుకొని పోయినా తానొక్కడ్నే మిగిలానని చెప్పుతుండేవారు.

శేషురెడ్డి – శ్రీ నిర్మల కొండారెడ్డికి వియ్యంకుడు. ఆయనకు ఒకే ఒక కుమారుడు – రవి. వారి కుటుంబానికి మా సానుభూతి.

## సణుగుడు

7 ...

నఘంటువులలో సిగ్గు, బిడియం, పరువు మర్యాద వంటి పదాలకు స్థానం వుండదు.

చంద్రబాబును నరే మెప్పిస్తారు – మరి కోవూరు, కోట ప్రజలను ఏమి చెప్పి నచ్చిస్తారు ప్రసన్న కుమార రెడ్డి గారు? జనం గొర్రెలు కాబట్టి తానేమి చెప్పినా వింటారను కుంటున్నారా?

* * *

నెల్లూరు ఆర్‌డిఓ గారు మన్నించాలి. గత వారం ఈ శీర్షికన చేసిన వ్యాఖ్యల ఉద్దేశం ఆమెను కించ పరచడం కాదు; ఆమె నిజ పరిస్థితిని అర్థం చేసుకోమని పాఠకులకు నచ్చ చెప్పడం.

ఒక మంత్రికి సంబంధించిన ఫిర్యాదుపై ఆర్‌డిఓను విచారణ చేయమని ఫైలు అప్పచెప్పడమే తప్పు; శేషన్ ఆ సీటులో కూర్చుని వుండినా, వ్యతిరేకపు నివేదిక వ్రాయలేరు. శేషన్ అయినా ఎన్నికల కమీషనర్‌గా స్వతంత్రం సంతరించుకున్న తర్వాత తన సత్తా చూపించారు కాని, ఐఎఎస్ అధికారిగా ఆయన అధికారంలో వుండే వారికి అనుగుణంగా నడుచుకున్నవారే కదా? క్యాబినెట్ కార్యదర్శిగా ఆయన రాజీవ్ గాంధీ ఉత్తర్వులు ధిక్కరించినట్లు ఎప్పుడైనా విన్నామా? చంద్రశేఖర్ మాట నిరాకరించినట్లు చదివామా? రాజకీయ వ్యవస్థకు, అధికార యంత్రాంగానికి తెలియని లంకె వుంటుంది. దాన్ని త్రెంపుకొని ఏ అధికారి బ్రతక లేరు. కొందరు రాజకీయాలతో మమేకమై పోతారు, మరికొందరు అంటీ ముట్టనట్లు వుండి పోతారు. శంక... వంటి నిప్పుతో సమమైన అధికారి కూడా చెన్నారెడ్డితో సర్దుకు పోవలసి వచ్చింది; అది సాధ్యం కానప్పుడు త్రిపురకు వెళ్లిపోయారాయన. అంతే తప్ప ఎదిరించి నిలబడింది లేదు.

ఈ కోణం నుంచి మాసినప్పుడు కుమారి శ్రీదేవి గారి నివేదికను తప్పు పట్టడం తప్పు అవుతుంది. చిన్న వయస్సులోనే మంచి అధికారిగా పేరు తెచ్చుకొన్నారామె. ఆషాఢభూతుల వంటి తెలుగుదేశం ఎమ్మెల్యేలతో వేగుతూ కూడా వివాదాస్పదం కాకుండా కాపాడుకొంటూ వస్తున్నారు. అందుకామెను అభినందించాలి. ఆమె విధి నిర్వహణ పట్ల మేము అభ్యంతరాలు చెప్పలేదు. మంత్రిపై నివేదిక వ్రాయవలసి వచ్చినందుకు జాలిపడ్డాం – అంతే!

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్ధ సం చందా రూ. 50/-
విడిప్రతి రూ. 2/-

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్థ సంవత్సరం చందా రూ. 50/-



**కోవూరు సబార్డినేటు జడ్జి వారి కోర్టులో**

I.A. 25/96, O.S.21/91

పిటీషనరు ... యిండియన్ ఓవర్సీస్ బ్యాంకు, నెల్లూరు

రెస్పాండెంటు ... (1) దువ్వూరు ఆదినారాయణ రెడ్డి వగైరాలు

R-3 కొండా భక్తవత్సల రెడ్డి, s/o బలరామి రెడ్డి, సాకిన్ – పొట్టెంపాడు గ్రామం, నెల్లూరు తాలూకా, నెల్లూరు జిల్లా, అను వారికి:-

పై నెంబరున ప్రిలిమినరీ డిక్రీని ఫైనలు డిక్రీ పొందుటకు దాఖలు చేసిన పిటీషనులో నీకు నోటీసు నిమిత్తం తే12.6.96దీ వాయిదా. ఆ దినం పై కోర్టులో నీవు ఉదయం 10 గం.లకు హాజరై ఆక్షేపణలు తెలుపుకో వలసింది. లేని ఎడల ఏకపక్షంగా తీర్మానించబడును.

W. సుబ్రహ్మణ్యం
పిటీషనరు వకీలు

**గుడివాడ ప్రిన్సిపల్ డిస్ట్రిక్ట్ మున్సిఫ్ కోర్టులో**

S.C. 63/94

ఫిర్యాదు: ది తమిళనాడు హ్యాండ్లూం వీవర్స్ కో–ఆపరేటివ్ సొసైటీ (కోఆప్‌టెక్స్) గుడివాడ Rep. by its మేనేజరు) ... వాది

! x

(1) P. సత్తిబాబు, s/o సూర్యారావు, F.C.I., నెల్లూరు. (2) P. సూర్యారావు ... ప్రతివాదులు

పై నెంబరు దావాలో P. సత్తిబాబు, వాది సొసైటీలో అరువు పద్ధతిన రూ.2251.20పైలు (అక్షరాల రెండువేల రెండు వందల ఏభై ఒక్క రూపాయి ఇరువై పైసలు) బాకీ ఉండి బాకీ చెల్లించ నందున పై దావా దాఖలు చేయగా సదరు ప్రతివాది దావా సమన్సు పుచ్చుకొనక కాలయాపన చేయుచున్నందున పేపరు ప్రకటన ద్వారా దావా సమన్సు అమలు తే28.6.96దిన వాయిదా వేయనందున పై తేది ఉదయం 10.30 గం.లకు పై కోర్టు వారి యెదుట హాజరై ఆక్షేపణలు తెలుపుకొనవలెను. లేని యెడల ఏకపక్షముగ తీర్మానించ బడును.

G. రాంబాబు, బి.కామ్.,బి.యల్., అడ్వొకేటు, గుడివాడ

## జిల్లావార్తలు

5 పేజీ తరువాయి

చిన్న పాటి పనులు కూడా చేపట్ట నిక్కరు. చిన్న సందుల్లో, గొందుల్లో రోడ్ల గూర్చి పట్టించు కోరంటే ఒకరకం; కాని నిత్యం వేలాది మంది నడిచే ప్రధాన రోడ్డు విషయం కూడా పట్టించు కోక పోవడాన్ని ప్రజలు విమర్శి స్తున్నారు. పొట్టి శ్రీరాములు సెంటర్ నుంచి సినిమా హాల్ల కూడలి మీదుగా రైల్వే గేటు వరకు వున్న రోడ్డును మూడు నెలల క్రి... రోడ్డును త్రవ్వి పారేశారు. తరువాత ఇరువైపులా కంకర తోలి సరిపెట్టు కొన్నారు. తమ అంగళ్ల ముందున్న కంకర గుట్టలను వ్యాపారస్తులు రోడ్డు పైకి త్రోసేసారు. ఎందర వందరగా రోడ్డంతా కంకర నిండి పోయి కాలి నడకన పోయే వారికి గుచ్చు కొంటున్నది. వాహనాలు పంక్చర్ అయి పోతున్నాయి. మునలి ముతక నడిచేందుకు పడరాని పాట్లు పడ వలసి వస్తున్నది. తోలిన కంకరను మూడు నెలలుగా ఎందుకు పరిపించ లేక పోయారో సమాధానం చెప్పే వారే కరువయ్యారు. కంకరను రోడ్డు పై పరచి రోలర్‌తో సరి చేయించి, మట్టి కప్పే పని చేస్తే ఒక రోజులో పూర్తవుతుంది. కాని నెలలు గడిస్తున్నా దిక్కు లేదు.

### బస్సులు లేక పడరాని పాట్లు

కావలి డిపో నుంచి అల్లూరుకు తగినన్ని ఆర్టీసి బస్సులు లేక పోవడం వల్ల ప్రయాణీకులు పడరాని పాట్లు పడుతున్నారు. ప్రైవేటు బస్సులు రద్దు చేసాక కావలి డిపో నుంచి మాత్రమే అల్లూరుకు బస్సులు నడుస్తున్నాయి. నెల్లూరు డిపో నుంచి ఒక్క బస్సు కూడా ఆర్టీసీ నడపడం లేదు. వచ్చే బస్సులకు కూడా మధ్య మధ్య అంతరం గంటల్లో వుండడం వల్ల ప్రయాణీకుల ఓపిక నశిస్తూంది. సింగపేట, ఉలవపాళ్ల, ...టగుంట, కడనూతల, ముంగమూరు, గౌరవరం స్టాపింగుల్లో అల్లూరు మీదుగా నడిచే ఆర్టీసీ బస్సులు మాత్రమే ఆగుతాయి. ప్రైవేటు మీద ఆర్డినరీ బస్సులు తక్కువగా నడపడం వల్ల ఈ రూటులోని ఈ బస్సుల కోసం కాచుకొని వుంటారు. కలెక్షన్ విషయంలో ఈ రూటులో మంచి లాభాలు వస్తున్నా ఆర్టీసి ప్రజలను నానా రకాలుగా ఇబ్బందులు పెడుతూ తక్కువ బస్సులు నడుపుతుంది తప్ప అవసరాలకు తగ్గట్లు బస్సులు నడపడం లేదు. నష్టాలు వచ్చే రూటుల్లో సిఫార్సుల మేరకు బస్సులు నడిపే అధికారులు లాభాల రూటు పట్ల ఎందుకు వివక్షత పాటిస్తున్నారో అర్థం కావడం లేదు.

## ప్రాంతీయపార్టీలు

రెండవ పేజీ తరువాయి

మూపనార్ కాంగ్రెస్, సమాజ్‌వాద పార్టీ, అకాలీదళ్, హర్యానా వికాస్ పార్టీ, అస్సాం గణపరిషత్ వంటి పార్టీలు తమ తమ రాష్ట్రాలలో తమ మద్దతు లేనిదే ఏ జాతీయ పార్టీ కూడా మనజాలని స్థాయికి ఎదిగి పోయాయి.

కేంద్రంలో ఎవరు ప్రభుత్వం ఏర్పాటు చేయాలన్నా, ఈ ప్రాంతీయ పార్టీల మద్దతు తప్పనిసరి. ఏ జాతీయ పార్టీతోనూ ఎన్నికల అవగాహన లేని తెలుగుదేశం, డిఎంకె, మూపనార్ కాంగ్రెస్‌లు బిజెపి పక్షం వెళ్తే వాజ్‌పేయి ప్రభుత్వం స్థిరత్వం సాధించే అవకాశా లేర్పడుతాయి; మూడవ ఫ్రంట్‌కు జై అంటే దేవగౌడ ప్రధాన మంత్రి అవుతారు.

బిజెపి, కాంగ్రెస్‌లు మినహా దేశంలో మరే పార్టీ కూడా స్వతంత్రంగా అన్ని రాష్ట్రాలలో అభ్యర్థులను కూడా నిలబెట్టలేని అవమానకర స్థితికి దిగజారి పోయాయి. ఆఖరుకు కమ్యూనిస్టులూ పశ్చిమ బెంగాల్, కేరళ, త్రిపురలకు పరిమితమైన ప్రాంతీయ పార్టీల వలె మారిపోయారు. జనతాదళ్ కూడా అంతే; వారి ప్రభావం బీహార్, కర్ణాటకల వరకే పరిమితం.

ఏ నాయకుడికా నాయకుడు స్వంత కుంపట్లు వెలిగించుకొని, తమ పలుకుబడి విస్తరించ గల్గిన మేరా తమ రాజకీయాన్ని పరిమితం చేసుకొం టున్నారు. చంద్రశేఖర్, జార్జి ఫెర్నాండెజ్‌ల వంటి సోషలిస్టు లీడర్లు బిజెపి కాషాయ జెండా క్రింద పేరులో మాత్రం సమతను మిగుల్చుకొని రాజకీయ ఉనికిని కాపాడు కుంటున్నా రంటేనే పరిస్థితి అర్థం చేసుకోవచ్చు. సిపిఎం సుత్తి కొడవలిని తెలుగు పచ్చ బ్యానర్ పైన, చంద్రబాబు ఫోటోకు దిగువ ముద్రించుకొని ఓట్లడుగుకొనే దౌర్భాగ్యంతో కమ్యూనిస్టులు అలమటి స్తున్నారు. కారల్‌మార్క్స్ సమాధి నుంచి లేచి రావడమంటూ జరిగితే – పసుపు గుడ్డపై కమ్యూనిజం ప్రచారం తిలకించి గుండె పగిలి చస్తారు.

ఏమైతేనేమి – నేటి ఢిల్లీ ప్రభుత్వం ప్రాంతీయ పార్టీల దయాదాక్షిణ్యాలపై ఆధారపడక తప్పదు; దేశ భవితవ్యాన్ని తిరగ వ్రాసే అవకాశం వారికి కల్పించారు ప్రజలు.

## పంచాంగం

**రోహిణికార్తె**

తే24శుక్ర రోహిణికార్తె ప్రారంభము.

**ముహూర్తములు**

తే22బుధ ఉ.7.20 గం.లకు మిధున లగ్నమున వ్యాపార ప్రారంభము.

**వివాహములకు**

తే23గురు ఉ.8.15 గం.లకు వివాహ వ్యాపార ప్రయత్నములకు సుము హూర్తము లున్నవి.

**మే తిథులు**

జ్యేష్ఠ బహుళ

తే 18 శని ప్రతిపత్ సా.గ. 4.50 వ
తే 19 ఆది విదియ రా.గ. 5.57 వ
తే 20 సోమ తదియ రా.గ. 7.28 వ
తే 21 మంగళ చతుర్థి రా.గ. 9.14 వ
తే 22 బుధ పంచమి రా.గ. 11.21 వ
తే 23 గురు షష్ఠి రా.గ. 1.23 వ
తే 24 శుక్ర సప్తమి సా.గ. 3.15 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ.,

## మాటలతో ఆట - 4

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | ■ | 3 | 4 | | ■ | 5 | 6 | ■ | 7 |
| 8 | | ■ | 9 | | | ■ | 10 | ■ | 11 | 12 | |
| | ■ | 13 | | | ■ | 14 | | 15 | ■ | | ■ |
| ■ | 16 | | ■ | 17 | 18 | | ■ | 19 | 20 | | 21 |
| 22 | ■ | 23 | | ■ | | ■ | 24 | ■ | | ■ | |
| 25 | 26 | | ■ | 27 | | 28 | ■ | 29 | | 30 | |
| 31 | | ■ | 32 | | ■ | 33 | | | ■ | | ■ |
| 34 | | 35 | ■ | 36 | 37 | | ■ | 38 | 39 | ■ | 40 |
| ■ | 41 | | | ■ | 42 | | 43 | ■ | 44 | 45 | |
| 46 | ■ | | ■ | 47 | | ■ | 48 | 49 | ■ | 50 | |
| 51 | 52 | ■ | 53 | | | 54 | ■ | 55 | | | ■ |
| 56 | | | ■ | | ■ | 57 | | | ■ | 58 | |

**అడ్డం**

1. మంచు (3)
3. పేద (3)
5. అన్నం (2)
8. పాపనుపిలవండి (2)
9. కాళ్లు (3)
11. రాజుల సేవకుడు (3)
13. విలుకాడు, పాము (2)
14. పెండ్లికూతురు కాళ్లకు వ్రాసేది (3)
16. నాడి (2)
17. శుద్ధి చేయడం, ఇంగ్లీషులో (3)
19. రాజులు చేసేయాగం (4)
23. ప్రాణం (2)
24. ఇ, వై, ము వంటి అక్షరాలు కలిస్తే అర్థవంతమైన పదాలు ఏర్పడేది (1)
25. మాయ చేసేవాడు (3)
27. దాసుడు (3)
29. సుర సౌందర్యవతి (4)
31. పయనంలో చివరమాయం (2)
32. పాడి (2)
33. రాజా – అటునుంచి (3)
34. నేలపై పరిచేది (3)
36. ఆ విధంగా అవివాహిత (3)
38. మెషిన్ (2)
41. కలర్చు (3)
42. గ్రామాధికారి పాతపేరు (3)
44. గర్వం (3)
47. జలపుష్పం (2)
48. విధం (2)
50. కృష్ణుడికివి జాస్తి (2)
51. ఆవికావు – అటునుంచి (2)
53. వస్తువు (4)
55. కోట గోడలపై వుండేవి (3)
56. ఎక్కువ తరి – ఆ వైపుగా (3)
57. తామర (3)
58. స్త్రీ ఆభరణం (2)

**నిలువు**

1. గన్ (3)
2. నువ్వెదిక్కని వెదుకోవడం క్రిందనుంచి(2)
3. ఆంధ్రదేశంలో ముఖ్యనది (4)
4. మహిమలు - 1, 4 (2)
6. దేవవేశ్య (2)
7. హాని (2)
9. మిల్క్ (2)
10. గొప్ప హేతువాది (2)
12. రాయికలిపితే అయస్కాంతం – తలక్రిందులుగా (3)
13. దావులేనివారు, ఒకనినినటుడు (4)
14. కిల్లి (2)
15. రాజాభార్య క్రింద నుంచి (2)
18. ముగించడం (3)
20. అసహ్యం (3)
21. కాలం – క్రింద నుంచి (3)
22. పార్వతీపతి (4)
26. బ్రాహ్మణుల భిక్షుకత్వం – శీర్షాసనంలో! (4)
27. తెలంగాణాసారా (3)
28. 1 అర్థమే, గజిబిజిగా (4)
29. చెంబర్ (3)
30. అవి నవరకాలు; పండ్లలో కూడా ఇదే! (2)
35. లేత ఆకు (3)
37. పెద్దగా నవ్వడం (4)
39. రుద్వేది – తలక్రిందులైంది (2)
40. ఇతరుల (3)
43. యుద్ధం–క్రిందనుంచి (2)
45. నెల్లూరుమాండలికంలోఆశ్చర్యం(3)
46. కూర్చునే స్థలం (3)
47. దగ్గర కావడం (3)
49. నక్క, కాళ్లపైన పెట్టేవుండి (3)
52. నాన్న చెల్లెలు (2)
54. వస్త్రంగి పనిముట్టు (2)

### మాటలతో ఆట - 2 సమాధానాలు

**అడ్డం:** 1. తిరుపతి, 4. చక్రంతో, 6. ద్రావకం, 8. సదా. 9. తిరవ, 10. రాక్షస, 11. మారుతి, 12. ప్రణం, 13. తామర, 15. నస, 16. మాత, 17. వారా, 18. సంపద, 20. నావి, 21. తరుపరి, 22. దానం, 23. యయాతి, 25. యథా, 26. వ్యర్థం, 27. మా, 28. గమ్యం, 29. ధ్యాన, 30. జా, 35. హాని, 33. రాతు, 35. సంది, 37. వాలకము, 39. దుమువులు, 41. వరి, 43. పౌరుషం, 44. వికరం, 47. మరా, 48. బాజా, 49. విహారం, 50. మనుజాడు, 51. రావి. **నిలువు:**- 2. రువరువ, 3. పరాతి, 4. చరణం, 5. వక్రం, 6. ద్రాక్షరసం, 7. వస, 9. తీవ్రత, 10. రామ, 11. మానసియ, 12. ప్రత, 13. తారాపథం, 14. అరసం, 16. మావి, 17. వాదు, 19. పదార్థం, 20. నాతి, 21. తథాగతుడు, 24. యాగశాల, 26. వ్యసనం, 31. నివాసం, 32. వినుమం, 34. నవ్వరు, 36. దివి, 38. కరుణ, 40. మాటలు, 42. దివాజా, 45. స్వాహా, 46. మను, 47. రాజా, 48. బాధి.

**ఈవారం అలికరెక్టుగా వ్రాసిన వారిలో విజేతలు:** ఎం. సుధారాణి, ఖైరతాబాదు, హైదరాబాదు; పి. వేణుగోపాల్ రెడ్డి, బాలాజీనగర్, నెల్లూరు.

**పజిల్ పూర్తి చేసి పంపిన ఇతర పాఠకులు:** – 1) ఎస్. కోటయ్య, పోలీస్ కాలనీ, నెల్లూరు; 2) శ్రీమతి జి. అరుంధతి, ఆరోస్ లేన్, తిరుపతి; 3) ఆర్.వి. సుధాకర మూర్తి, వరవంటి కుండంపాడు, నెల్లూరు జిల్లా; 4) డాక్టర్ జి.పి. రెడ్డి, నెల్లూరు; 5) ఎస్. సుబ్బారావు, కావలి. 6) ఆర్. మాదవరెడ్డి, గూడూరు; 7) ఎ. మంజుల, అడయార్, మద్రాసు.

## సిల్క్‌స్మిత కళ్ళమెరుపు రహస్యం

"ఎంతో కాలంగా మిమ్మల్ని సినిమాలలో చూస్తున్నాను. మీకు వయసు మీరినట్లు కొస్తయినా కనిపించదే!" అని సిల్క్ స్మితను వాణీ విశ్వనాథ్ అడిగింది. సిల్క్‌స్మిత కనురెప్పలు వొయ్యారంగా టపటప లాడిస్తూ, "వయసు మీరినట్లు ఎందుకు కనిపించాలి? ముందు బాగా కష్టపడ్డాం. పేరూ, డబ్బూ సంపాదించాను. ఆ ధనమదంతో ఇష్టమొచ్చినవన్నీ తింటూ లావెక్కిపోతాను. దాంతో బుకింగ్‌లు తగ్గిపోతాయి. నాన్ వెజిటేరియన్ నేను తిని ఎంత కాలమైందో? అసలు ఘన పదార్థాలు బాగా తగ్గించేసి, నిమ్మరసం, పళ్ళరసాల వంటి ద్రవ పదార్థాలే ఎక్కువగా తీసుకుంటున్నాను. కడుపును ఆకలితో బాగా మాడుస్తున్నాను. నా ప్రాణాలన్నీ కళ్ళల్లో తొంగి చూస్తుంటాయి గనుక కళ్ళు అంత ఆకర్షణీయంగా ఉంటున్నాయి," అని సుదీర్ఘ వివరణను ఇచ్చింది. "నాన్ వెజిటేరియన్ తినకుండా నేను ఉండలేనబ్బా!" అంటూ వాణీ విశ్వనాథ్ సెలవు తీసుకున్నది.

### పెళ్ళి పిలుపు

"[illegible] నుండు ఓ అమ్మాయి [illegible] తీయటి కలలు కంటుంది. ఎన్నెయ్యాక అవన్నీ వమ్ము కావడంతో ఆ యువతి పడే ఆవేదనే ఈ చిత్ర ఇతివృత్తం," అన్నారు డైరెక్టర్ పి. లక్ష్మణ్. ఈయనే ఛాయాగ్రాహకుడు కూడా. ఈ చిత్రంలో ఆలీ, సుధీర్ బాబు, అమూల్య, రంగోలి, తనికెళ్ళ భరణి, అన్నపూర్ణ, తెనాలి శకుంతల, నీలిమ, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, శ్రీధర్, వేణుమాధవ్, మూర్తి, మల్లికార్జునరావు పాత్రధారులు. సంగీతం : రాజ్.



ఇంట్లో ఇల్లాలు – వంటింట్లో ప్రియురాలు చిత్రంలో వెంకటేష్, సౌందర్య

# రాజనాలకు దాసరి సాయం

దాసరి నారాయణ రావు జన్మదినం నాడు "ఒరేయ్ రిక్షా" చిత్రం జూబ్లీ వేడుకలు మద్రాసులో జరిగాయి. దాసరి అయిదు లక్షలు, ప్రజానటుడు ఆర్. నారాయణ మూర్తి అయిదు లక్షలు – మొత్తం పది లక్షలతో ఒక ట్రస్టు ఏర్పాటు చేశారు. తొలి కార్యక్రమంగా నిస్సహాయ స్థితిలో ఉన్న ప్రముఖ నటుడు రాజనాలకు 50 వేల రూపాయల చెక్‌ను పంపించారు.

**పదిలక్షలతో దాసరి ట్రస్ట్; రాజనాలకు రూ.50 వేల తొలి చెక్!**

### రజనీకాంత్ నేపాల్ పయనం

నా పని పూర్తయ్యింది. తమిళనాడు పూర్తిగా పాడవకుండా చేయగలిగాను. జయలలితను గద్దె దించడంతో నా బాధ్యత ముగిసినట్లే. ఆమె సర్వాధికారిణిగా ప్రవర్తించే వారు. ఒక దశలో అసలామె ఏం చేస్తుందో ఆమెకే తెలియదు. అంతగా కళ్ళు బైర్లు కమ్మాయన్న మాట. ఆమె పాపం పండింది. సింహాసనం మీద నుంచి కిందికి తొయ్యబడింది. పదవీ ధరులెవరైనా అహంకారంతో ప్రవర్తిస్తే పతనం తప్పదనడానికి ఆమె ఓ చక్కని ఉదాహరణ. కాస్త విశ్రాంతి అవసరమనిపించి నేపాల్‌కు పయన మవుతున్నాను. నెల రోజులు ఖాట్మండులో ఉండి మద్రాసుకు తిరిగి వస్తాను. నా అభిమాన సంఘాల వారందరికీ నా కృతజ్ఞతలు మరీ మరీ తెలుపుకుంటున్నాను అన్నారు రజనీకాంత్ మద్రాసు విమానాశ్రయంలో.

### మహిళాసేవలో అపస్వరం

ఆశాజ్యోతి విజయశాంతి యువసేన ఆధ్వర్యంలో ఇటీవల తిరుపతి వెస్ట్ రైల్వేస్టేషన్ వద్ద జరిగిన ఒక కార్య క్రమంలో వెయ్యిమంది మహిళల కోసం నిర్దేశించిన కార్యక్రమంలో విజయశాంతి 200 మందికి మాత్రం చీరలను స్వయంగా

కొరవ 11 పేజీలో

## పెదవులేనా రోజాలోని ఆకర్షణ?

"మీలోని ప్లస్‌పాయింట్ ఏది?" అంటే రోజా ఇచ్చే సమాధానం – పెదవులు. నాలో కొట్టొచ్చినట్లు కనిపించే ఆకర్షణ అదే అని చాలా మంది అంటుంటారు. శీతాకాలంలో పెదవులు పగలకుండా గోరువెచ్చని నీటితో శుభ్రం చేస్తాను. ఆ తర్వాత తేనె, నెయ్యి కలిపి పెదవులకు పూస్తాను. షూటింగ్ సమయాలలో తప్ప సాధారణంగా నేను లిప్‌స్టిక్ వేసుకోను," అంది రోజా. కాని, కొత్తగా ఈమె ఒక సమస్యను ఎదుర్కోవలసి వస్తోంది. "ఈమెకు 8 సంఖ్య అచ్చిరాదని ఒకరన్నారట. ఈమె ఇప్పుడున్న ఇంటి నెంబర్ 8; త్వరలోనే ఇల్లు మార్చాలని ఉంది," అంది రోజా.

### బొబ్బిలి దొర

"నా తండ్రివి నువ్వే." అంటాడు కొడుకు. "కాని, నువ్వు నా బిడ్డవు కాదు," అంటాడు తండ్రి. ఈ రెండు పాత్రల సంఘర్షణే 'బొబ్బిలిదొర' అన్నారు డైరెక్టర్ బి.కామేశ్వర రావు. తండ్రి కొడుకులుగా కృష్ణ ద్విపాత్రాభినయం నిర్వహిస్తున్న ఈ చిత్రంలో విజయ నిర్మల, సంఘవి, సంగీత, కోట శ్రీనివాస రావు, రామిరెడ్డి, బాలయ్య, ప్రసాద్ బాబు, తనికెళ్ళ భరణి, రాళ్ళపల్లి, రాజా రవీంద్ర, మల్లికార్జున రావు, శివపార్వతి, రజిత పాల్గొంటున్నారు. రచన : పరుచూరి సోదరులు, సంగీతం : కోటి.

### జగదేకవీరుడు హిందీలో

పద్మాలయ పతాకంలో హిందీలో తయారయ్యే "జగదేక వీరుడు" చిత్రంలో అక్షయ్ కుమార్ హీరో, దర్శకత్వం : సాగర్.

## సమకాలీన జీవిత వాస్తవాల చిత్రణతో మహాద్భుతంగా ఆవిష్కరించిన దృశ్యకావ్యం

# భారతీయుడు

**చిత్ర సమీక్ష**

**ప్రసాద్**

ఇది ప్రబోధాత్మకం కాదు; సందేశాత్మకమూ కాదు; విప్లవం పేరుతో వెర్రికేకలు లేవు; ఎర్రెర్రనిదీ జెండా... వంటి వెగటు కల్గించే దృశ్యాలు లేవు; నీతి బోధల సుత్తి కొటుడులు లేవు; ప్రేక్షకులను ఆలోచింపజేసి, ఆవేశం రగిలించాలనే ప్రయత్నమూ దర్శకుడు చేయలేదు. సమకాలీన జీవిత వాస్తవాలను నగ్నంగా, పచ్చిగా, సూటిగా తెరపై చిత్రించి వదిలేశాడు దర్శకుడు. భారతమాత పాలిండ్ల నుంచి అవినీతి రక్తం పీలుస్తున్న రక్కసులను, వారి వారి నిజరూపాలతో ప్రేక్షకుల ముందు నిలబెట్టాడు.

పక్కా వ్యాపార చట్రంలో, ఫార్ములా మసాలా దినుసులు బాగా దట్టించి, యువతరం నరాలను పురిపెట్టి శృంగారపు తాలింపు పెట్టి, హింస, ఫైటింగుల కరివేపాకు చేర్చి, కెమెరా ట్రిక్కుల పోపు వాసనలు ఘుమాయింపజేసి గాముల రాకులు పోగు చేసుకోవాలనే వాణిజ్య లక్ష్యంతో తీసిన చిత్రమిది. ఆ కృషిలో దర్శకుడు నూటికి నూరుపాళ్ళు నెగ్గినట్లే లెక్క. ప్రేక్షకులు హాలు పట్టకుండా వస్తున్నారు.

టిక్కెట్ల అమ్మకమే చిత్ర ఘనతకు లొక్కా మనుకొంటే ఈ "భారతీయుడు" చిత్రం గురించి ప్రత్యేకంగా చెప్పుకోనవసరం లేదు. కళ్ళతో చూడడం తప్ప, మనసుతో ఆలోచించడం మొదలు పెడితే కడుపులో వికారం రేగి, హాలులోనే వాంతులయ్యేంత వికృతంగా వుండే తెలుగు చిత్రరాజాలు కొకొల్లలుగా శతదినోత్సవాలు జరుపుకోవడం మామూలే! కాని, భారతీయుడు సినిమాలో వ్యాపార విలువల తళుకుల వెనుక సామాజిక జీవన చిత్రణ బాగివుంది; నిర్మాత పెట్టుబడికి రెట్టింపు లాభం చేకూర్చిపెట్టాలనే దర్శకుడి తపన వెనుక భారతమాత దౌర్భాగ్యస్థితి పట్ల ఆవేదన అంతర్లీనమై వుంది. అందువల్లే ఈ సినిమా అంత సంచలనం సృష్టిస్తున్నది; అందరూ ప్రేక్షకులను అయస్కాంతం వలె ఆకర్షిస్తోంది.

సేనాపతి – స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న విప్లవ వీరుడు. దేశమాత దాస్య శృంఖలాలు తెగనరకడానికి తన జీవితాన్ని తర్పణ చేయడానికి సిద్ధపడి, నేతాజీ సుభాష్ చంద్ర బోస్ సైన్యంలో పనిచేసిన యోధుడు ; ఆయన భార్య – అమ్మతం – స్వరాజ్య సమరంలో ప్రాణ త్యాగానికి సిద్ధపడిన త్యాగి; వీరి సంతానం – చందు. తల్లిదండ్రుల దేశభక్తి, ఆశయ నిబద్ధత, వ్యక్తిత్వ సౌశీల్యం, త్యాగశీలతలు ఏ మాత్రం అబ్బని నగటు భారతీయ యువకుడు వ్యక్తిత్వం కంటే వ్యక్తిగత సౌఖ్యం ముఖ్య మనుకొని, ఎంత నీచానికైనా దిగజారి బ్రతికేయడంలో తప్పులేదనుకొనే తత్వం అతడిది. ఇద్దరి మధ్య సహజంగానే సంఘర్షణ, తండ్రి పల్లెటూరులో వుండిపోతే – తనయుడు సిటీకొచ్చి అవినీతిని తన జీవన ప్రక్రియగా మార్చుకొని, పుష్కిగా లంచాలు మేస్తూ ఉద్యోగంలో స్థిరపడి పోతాడు.

జీవిత వాస్తవాలకు, ఆదర్శ జీవన విధానానికి లంకె కుదరక – సేనాపతి కళ్లముందే కన్న కూతురు కాలి మసైపోతుంది. లంచం కోసం తన కూతురుకు వైద్యం చేయకుండా చంపిన డాక్టరు, పోలీసాఫీసరు, వి.ఎ.ఓ.లను సేనాపతి చంపేస్తాడు. ఈ ధర్మయుద్ధంలో తన కళ్ళకు తారసపడిన మరిద్దరు అవినీతి పరులైన అధికారులనూ హతమారుస్తాడు. సమాజవనంలో మొలిచిన ఈ కలుపు మొక్కలను తాను ఏరిపారేస్తుంటే – తన కొడుకు విషవృక్షం వలె వికృత రూపం ధరించడం చూసిన ఆవేదనతో, కన్న ప్రేమను చంపుకొని, కొడుకునూ తెగనరుకుతాడు. పోలీసుల కళ్ళు కప్పి, విదేశాలకు పారిపోయి – లంచపు చెదపురుగు ఎక్కడ కన్పించినా తాను తిరిగి వస్తానని హెచ్చరిస్తాడు.

స్థూలంగా ఇదీ కథ. ఈ కథను యథాతథంగా తెరకెక్కించి వుంటే – బోర్ కొట్టే ఆర్ట్ ఫిలిం అయి వుండేది; హాలులో నుంచి ప్రేక్షకులు తలవిడ్చుకొని పారిపోయి వుండేవారు. కాని దర్శకుడు ఈ కథకు అత్యద్భుతమైన నాటకీయతను రంగరించ తేశాడు. కంప్యూటర్

కొరవ 11 పేజీలో

# రాయి – తురాయి

## బూతులలో కెల్లా పాలబూతు మేలు!

"ఈసారి మధ్యతరగతి మహానుభావులు ఓటింగుకు రాలేదు" అంటూ ఒక పార్టీ కార్యకర్త వాపోయ్యారు నాదగ్గర. ఎప్పుడైనా వాళ్లు ఎలక్షన్ బూతు మొగం చూసి ఉంటే కదా – ఈసారి అని అనడానికి అస్కారం?

వాళ్లు ఉగాదిలిసి నప్పటి నుంచి చూస్తున్నాను; మధ్యతరగతి మేధావులు ఎక్కువ శాతం బూతుకు రారు – ఓటు వెయ్యను గాక వెయ్యరు; ఒక్క పాల బూతుకు మాత్రం అనుదినం పోతూ వస్తూ ఉంటారు. తక్కిన బూతులు వాళ్లకు సరిపడవు.

పోలింగు బూతుకు వెళ్లి ప్రయోజన మేముంది? పాల బూతుకు వెళ్లి పాల ప్యాకెట్టు తెచ్చుకొంటే, కమ్మని ఫిల్టరు కాఫీని చప్పరిస్తూ, వార్తా పత్రికల్లోని వార్తలను వడపోత పోసుకోవచ్చు; ఆ వడపోతలో డి.ఎ.లు దిగితే సంబరంతో మరో గుప్పు కాఫీ తాగొచ్చు. రాయితీలు ఏవైనా రాలిపడితే వాటిని రాబట్టుకొనే మార్గాలను అన్వేషించు కోవచ్చు.

పోలింగు బూతులో ఇన్ని 'వచ్చుబడు'లు వస్తాయా, వస్తాయా? ఇదీ ఆ తరగతి చింతన – అంటే ఫిలాసఫీ.

మిడిల్ క్లాసుకు దిగువన ఒక బెర్తు – లోయర్ మిడిల్ క్లాస్ – ఎగువన మరొక బెర్తు – అప్పర్ మిడిల్ క్లాస్ – ఈ మూడు బెర్తుల మనస్థితి ఇంచు మించు ఈషద్భేదంతో – ఒకటే. కడుపులో చల్ల కదలకుండా కాలక్షేపం చెయ్యడం. ఈ ఎలక్షన్ నుండి మర్లి వచ్చే

**అగ్ని మిత్ర**

ఎలక్షన్ దాకా రాజకీయ పక్షాలను ఉతికి ఆరేస్తుంటారు. ప్రభుత్వాల పని తీరును ఆక్షేపిస్తుంటారు. నీతికి విలువ లేదంటారు; దేశం చెడిపోయిందంటారు. తీరా ఎన్నికల సమయానికి ఏమీ పట్టనట్టు నిక్షేపంగా నిద్రపోతారు. ఇది మేధావుల లక్షణమో, మందమతుల విలక్షణమో మనం చెప్పలేం.

డాక్టర్ సి. నారాయణ రెడ్డి "మధ్య తరగతి మంద హాసం" అని ఒక కావ్యం రాశారు. ఆయన అసలు సిసలైన కవి.

"మందహాసం' లో మందమతి తనాన్ని వక్రోక్తి వైభవంలో ఒడుపుగా చూపారేమో – నాకు తెలియదు. మొత్తానికి మధ్య తరగతి జీవన శైలి విలక్షణంగా, ఎలక్షన్లకు దూరంగా వైదొలిగి పోతూ ఉంటుంది.

ఎలక్షను అయిన మరునాడు ఒక మిత్రుడు నన్ను అడిగాడు – "ఓటు వేశావా?" అని, "నేనూ మధ్య తరగతి మేధావినే -" అని బదులిచ్చాను. "అంటే – వెయ్యలేదన్నమాట" అన్నాడు.

చూడండి – నేను "మధ్యతరగతి" అన్నానో లేదో, "ఓటు వెయ్యలేదు" అని ఖచ్చితమైన నిజాన్ని ఊహించేశాడు. తర్వాత తన గొడవ మొదలు పెట్టాడు.

"మా ఇద్దరి ఓట్లు (ఆయనా, ఆయన భార్య) మా పని మనిషి, దాని మొగుడు వేసేశారంట" అని చెప్పి పగలబడి నవ్వేశాడు.

"అదెట్లా? మధ్యతరగతి మేధావుల ఓట్లను పని మనుషులు వేసేటట్లు పవర్ ఆఫ్ పెట్టా ఇవ్వచ్చు నంటూ శేషన్ ప్రత్యేక ఉత్తర్వు లేవైనా జారీ చేశాడా?" అని ప్రశ్నించాను నేను – నవ్వుతూనే –

"అరె నీ చమత్కారం కాఫీకప్పులో కలిసిపోనూ – చెప్పేది విను – మేమిద్దరం పోలింగు స్టేషనుకు వెళ్లమని మా పని మనిషికి తెలుసు. అందుకని మా ఓట్లు అదీ, దాని మొగుడూ వేసేశారు; అది చాలదన్నట్లు – పొద్దున్నే వచ్చి మా ఆవిడతో – "అమ్మగారూ, మండే ఎండలో మీరిద్దరూ రాలేరు గదా, మీ ఓట్లు ఎందుకు ఉర్థాకావడం అని మేమిద్దరం వేసేశాం." అంటూ మూతి మూడుసార్లు తిప్పిందట. ఆ మూతి తిప్పుడుకు అర్థం ఏమిటో చెప్పమని నా ఇల్లాలు నన్ను సాధిస్తుంది. "ఆడవాళ్ల మాటలకు అర్థాలు వేరుగా ఉండవచ్చు – కాని చేష్టలకు కూడా అర్థాలూ, తాత్పర్యాలు ఉంటాయా ?" అన్నాను నేను.

"మా తెలివి తెల్లారినట్లే ఉంది – మీరు రోజూ సతికే న్యూస్ పేపర్లో అటు పంటివి ఉండవు. లోకాన్ని చదవడం నేర్చుకోండి. దాని చేతగాని తనానికి దాని మూతి విరుపు ఎత్తి పొడుపు" అంటూ రుసరుస లాడింది మా శ్రీమతి.

"ఏమనే నంటావా? దాని మూతి విరుపులో అంత వగలారి. హేళన ఉందంటావా?" నా నేస్తం వేసిన ప్రశ్నకు బదులివ్వ కుండానే నా గోడ వెళ్లబోసుకోవడం మొదలు పెట్టాను.

"మా ఇంటావిడ లేకుండా నేనొక్కడినే, జస్ట చల్లబడ్డ తర్వాత పోలింగ్ బూతు కెళ్లాను." నన్ను పూర్తిగా చెప్పనివ్వ కుండానే "ఓటు వేశావా? అన్నాడు. పాపం వేసి ఉంటానేమోనని అతని సంశయం; మధ్య తరగతి నుంచి నిన్ను వెలేస్తాం – జాగ్రత్త" అని హెచ్చరిస్తున్నట్లుగా ఉన్నాయి అతని చూపులు.

నేను అందుకొన్నాను. "నన్ను పూర్తిగా చెప్పనివ్వు; నేను పురుషుణ్ణే కదా?" నా ప్రశ్న పూర్తి కాకుండానే –

" అదేమిటి – పిచ్చి ప్రశ్న ! అని ఆశ్చర్య పొయ్యాడు.

"నా పేరు చివర "అయ్యా" బదులు "అమ్మ" అనే స్త్రీ వాచకం ఉంది ఓటరు లిస్టులో.

"బ్రాకెట్టులో "పు" లేదా?' అడిగేడు నా నెచ్చెలి. "ఉంది" అన్నాను. పేరులో పురుషత్వం పోయి బ్రాకెట్టులో తలదాచు కొంది.

"అయితే 'అయ్యా' 'అమ్మ'గా అచ్చు చచ్చుబడింది – ఓటివ్వమని అడగలేదూ?

"అడిగేను" అన్నాను.

"ఎవడి కోసం ఇస్తారు – వచ్చినట్లు ఇచ్చి ఉంటాడు." అని ధీమాగా నా వైపు చూశాడు.

"ఇవ్వలేదు"

"ఎందువల్ల?" మిత్రుడి ప్రశ్న.

"మీ ఓటు ఎప్పుడో పోలై పోయిందన్నాడు. నెత్తిన గుడ్డేసు కొని పొమ్మన్నాడు."

నా మిత్రుడు కోపంతో ఊగి పోతున్నాడు. మొగం కందగడ్డ పేపులో కదన కుతూహలాన్ని ప్రదర్శిస్తున్నది. కళ్లు ఎర్రబడ్డాయి. వాళ్లు వేడెక్కి పోయింది.

"ఛీ..ఛీ... ఇంత దుర్మార్గమా? ఏదో పార్టీ వాడు పోల్ చేసుంటాడు.

ఎన్నాళ్లీ తప్పుడు బతుకులు?

ఇక దేశం బాగుపడే దెప్పుడు?

ఆవేశంగా మాట్లాడేస్తున్నాడు.

మధ్యలో నేనందుకొని 'మనం తప్పకుండా ముందుగానే 'బూతు'కు వెళ్లి నప్పుడు-" అన్నాను.

అంతే నా మిత్రుడి ఆవేశం ఏమైందో కాని - 'అరె – నీవు బూతు అంటే గుర్తు కొచ్చింది. పాల సంగతే మరిచి పొయ్యాను." అంటూ బూతుకేసి పరుగులు దీశాడు.

## పార్లమెంట్‌లో పార్టీల బలాబలాలు

11వ లోకసభలో వివిధ పార్టీల బలాబలాలు ఇవీ.

| | |
|---|---|
| మొత్తం సీట్లు | : 545 |
| ఎన్నికలు జరిగినవి | : 537 |
| ఫలితాలు వెల్లడైనవి | : 534 |
| **బిజెపి కూటమి :** | |
| బిజెపి | : 161 |
| శివసేన | : 15 |
| సమతా పార్టీ | : 8 |
| అకాలీదళ్ | : 8 |
| హర్యానా వికాసపార్టీ | : 3 |
| మొత్తం | : 195 |
| **కాంగ్రెస్ కూటమి :** | |
| కాంగ్రెస్ | : 136 |
| **వామపక్ష కూటమి :** | |
| జనతాదళ్ | : 43 |
| సిపిఎం | : 32 |
| సిపిఐ | : 12 |
| సమాజ్‌వాద పార్టీ | : 17 |
| ఆలిండియా ఫార్వర్డ్ బ్లాక్ | : 3 |
| ఆర్ఎస్‌పి | : 5 |
| అస్సాం గణపరిషత్ | : 5 |
| మొత్తం | : 117 |
| **ప్రాంతీయ పార్టీలు :** | |
| డిఎంకె | : 17 |
| తమిళ మనాలి కాంగ్రెస్ | : 20 |
| తెలుగుదేశం (బాబు) | : 16 |
| మాధవరావు సింథియా | : 1 |
| జార్ఖండ్ ముక్తిమోర్చా | : 1 |
| కర్ణాటక కాంగ్రెస్ | : 1 |
| మజ్లిస్ (ఒవైసీ) | : 1 |
| ఎంజిపి | : 1 |
| యుజిడి | : 1 |
| ఎన్‌యుఎల్ | : 1 |
| ఎస్‌డిఎఫ్ | : 1 |
| ఎఎస్‌డిపి | : 1 |
| బిఎల్‌పి | : 1 |
| మొత్తం | : 63 |
| **ఇతరులు :** | |
| బహుజన సమాజ్‌పార్టీ | : 10 |
| తివారి కాంగ్రెస్ | : 4 |
| మొత్తం | : 14 |
| స్వతంత్రులు | : 9 |

జమ్మూ కాశ్మీర్‌లో 4 నియోజక వర్గాలకు మిలిటెంట్ల హెచ్చరిక, వాతావరణ పరిస్థితుల దృష్ట్యా ఎన్నికలు జరుగలేదు. ఆంధ్రలో, తమిళనాడులో రెండు నియోజక వర్గాల ఎన్నిక పెండింగ్‌లో పడింది. జమ్మూలో రెండు దగ్గర లెక్కింపు జరగలేదు. పాట్నాలో రిపోలింగ్ జరుగుతున్నది. మొత్తం 9 స్థానాలు ఇట్లా పెండింగ్‌లో వున్నాయి.

# జనవాణి

3వ పేజీ కొరవ

అవినీతి పెచ్చు పెరిగిపోయింది. ప్రజల కొనుగోలు శక్తి పెరగకుండా నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశాన్ని అంటాయి. ఎన్నికల ముందు ప్రచారంలోకి వచ్చిన హవాలా కుంభకోణం పార్టీని క్రుంగ దీసిందనేది వాస్తవం. అంతర్గత కుమ్ములాటలు పలు రాష్ట్రాల్లో ఓటర్లను తికమక పెట్టాయి. పివి నరసింహారావు వాన్నుడు ధోరణి పార్టీకి అరిష్టాన్ని తెచ్చి పెట్టింది. స్థానికంగా జనార్దన రెడ్డి కృషి ఫలితంగా నెల్లూరు, తిరుపతి సీట్లు, మాగుంట వ్యక్తిగత గ్లామర్ వల్ల ఒంగోలు సీటు కాంగ్రెస్ పార్టీకి వచ్చాయి. అభ్యర్థుల ఎంపిక సమయంలో పార్టీ నాయకుల్లో అసంతృప్తి వుండింది గాని తరువాత అందరూ కలిసికట్టుగా పనిచేయబట్టే జిల్లాలో మంచి విజయాలు సాధించారు.

విశాఖపట్నంలో టి. సుబ్బరామ రెడ్డి విజయంతో రాష్ట్రంలోని నాలుగు స్థానాల నుంచి నెల్లూరీయులు ఎమ్పీలయ్యారు. వీరంతా సమష్టిగా కృషిచేసి నెల్లూరు అభివృద్ధికి పాటుబడాలని మనవి.

నెల్లూరు టి.వి. నారాయణ

### పివి ధోరణి మారాలి!

పివి నరసింహారావు ప్రధానిగా భారత దేశపు గౌరవ ప్రతిష్టలు విదేశాల్లో సైతం పెంచారు. ఈ విషయంలో ప్రతి కాంగ్రెస్ కార్యకర్త ఆయనను మనసారా అభినందించాలి. కాని పార్టీ నాయకునిగా ఆయన నిరంకుశ నాయకత్వ లక్షణం పార్టీ కార్యకర్తలను మెప్పించలేక పోయింది. ప్రధానిగా చూపించిన దీక్షాదక్షతలు పార్టీ అధ్యక్షునిగా నిర్వర్తించ లేకపోయారన్నది వాస్తవం. పివి ఈ విషయంలో వాస్తవాలు గ్రహించడం మంచిది. కడపలో వై.ఎస్. రాజశేఖర్ రెడ్డికి కూడా ప్రజలు తగిన బుద్ధి చెప్పారు. అసెంబ్లీ ఎన్నికల్లో మాత్రం తెలుగుదేశం గెలవాలి; లోకసభకు మాత్రం తాను వెళ్లాలంటే ఎలా? అటువంటి ద్వంద్వ నీతిని కాంగ్రెస్ నాయకులు ఇకనైనా మానుకోవాలి. ప్రజలు పార్టీని మనసు నుండి చెరుపు కోలేక కాంగ్రెస్‌కు ఓటేస్తున్నారు తప్ప తమ ఘనత కాదని కాంగ్రెస్ నాయకులు గమనిస్తే మంచిది.

గంగవరం జి. రామకృష్ణ ప్రసాద్

### ఉత్తర కుమారుడైన నల్లపురెడ్డి ప్రసన్న!

మాజీ మంత్రి నల్లపురెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి ప్రకటనలు, సవాళు పత్రికల్లో చూస్తుంటే ఆశ్చర్యం కలిగేది. చివరికి అవి ఉత్తర కుమారుని ప్రగల్భాలుగా తేలిపోయాయి. ఇప్పుడు తిరిగి చంద్రబాబు నాయుడు భజన చేయను రెడీ అయిపోయాడు. ప్రసన్నప్రవర్తన చూస్తుంటే నీతిలేని రాజకీయాలు గుర్తుకు వస్తున్నాయి. ప్రసన్న ప్రకటన తీరు చూస్తుంటే జిల్లాలోని ఎమ్మెల్యేలందరినీ కలిసి క్షమాపణ చెప్పుకొన్నా ఆశ్చర్యమేమీ లేదు. ఏది ఏమైనా నల్లపరెడ్ల కుటుంబ ప్రతిష్టను ప్రసన్న బాగా దిగజార్చారు.

నెల్లూరు టి. వాసుదేవ

### ఎమ్పీలకు పరీక్షాసమయం

ఈసారి లోకసభ ఎన్నికల ఫలితాలు ఆయా పార్టీల ప్రముఖులనేగాక దేశ ప్రజలందరినీ గందరగోళంలో పడేశాయి. వచ్చింది హంగ్ పార్లమెంటు అయినా, ఎన్నికైన ఎమ్పీలు మెలుకువతో వ్యవహరించాలి. అధికారానికి డబ్బుకు అమ్ముడు పోకూడదు. ఎమ్పీలు సంయమనం పాటించి, సహనాన్ని చూపాలి. ఏది ఏమైనా దేశానికి సమర్థుడైన నాయకుడు కావాలి. భారీ ఖజానా, కావల్సినన్ని అప్పులు కాబోయే దేశ నాయకుడికి స్వాగతం పలుకు తున్నాయి. కాని ఎన్నికల్లో ఈ విషయమై నాయకులను నిలదీసిన ప్రజలు లేరు. ఏ ప్రభుత్వం అధికారంలోకి వచ్చినా కాసింత నీతివంతమైన పాలన అందించాలి. దేశ ప్రతిష్టను దిగజార్చే పనులు చేపట్టకూడదు.

కల్లూరుపల్లి కాలనీ జి. అనుపమ

### రాష్ట్ర ప్రభుత్వ వైఖరి బాగోలేదు!

పార్లమెంటు ఎన్నికల ఫలితాలు రాక ముందే రాష్ట్ర ప్రభుత్వం పాలధరలు పెంచింది. కరెంట్ చార్జీలు పెంచేందుకు కూడా రంగం సిద్ధం చేసుకొని వున్నట్లు పత్రికల వార్తాకథనాల ద్వారా తెలుస్తూంది. 1500 కోట్ల రూపాయల వరకు పన్నులు విధించి, రాష్ట్ర ఖజానాను సరిదిద్దు కోవాలని ప్రయత్నం చేస్తున్నారట. ఇప్పటికే నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశానికి అంటి సామాన్యుడు విలవిల లాడి పోతున్నాడు. రైతుల పరిస్థితి అకాల ఉత్పాతాల వల్ల అగమ్య గోచరంగా వుంది. ఈ పరిస్థితిలో ఎటువంటి పన్ను పెంపక విధానాన్నీ ప్రభుత్వం చేపట్ట రాదని మనవి.

నెల్లూరు కె. పోలిరెడ్డి

శారదా సాహితీ సంస్థ నిర్వహించిన శ్రీ మద్రామాయణ సంప్తాహం ముగింపు సభలో వక్త అమృతవాక్కుల శేషకుమార్‌ను సన్మానిస్తున్న ఎల్. లక్ష్మణ శ్రీనివాసరావు, ప్రక్కన బి. సీతారామ శాస్త్రి, ఎ. రవీంద్రబాబు.

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

అకాడమీ ఏర్పాటు చేసిన 'మాసం మాసం సాహితీ సమావేశం'లో హిప్నటిజం పరిధుల్ని విస్తృతంగా వివరిస్తూ అభిభాషించారు. సమావేశానికి అధ్యక్షత వహించిన ప్రముఖ సాహితీవేత్త వాకాటి పెంచలరెడ్డి అకాడమీ సాహిత్య సేవల్ని ప్రస్తావిస్తూ ఆధునిక యుగంలో మానసిక ఘర్షణలకు గురవుతున్న సమాజంలోని ప్రజల్ని సేదదీర్చి, చైతన్యవంతం చేయడానికి సాంస్కృతిక సంస్థలు తప్పకుండా వుండాలన్నారు. పురాణ సాహిత్యాల గొప్పతనం, ప్రతిభా పాటవాలను గూర్చి డాక్టర్ అమృతవాక్కుల శేషకుమార్ మాట్లాడుతూ మానవ జీవితంలోని అన్ని అంశాలనూ పురాణ సాహిత్యంలో పరిష్కారాలతో సహా పొందుపరచి వున్నట్లు చెప్పారు. 'నాకు నచ్చిన పుస్తకం' అంశంలో పెదుగు రామకృష్ణ సాహిత్య నేత్రం పుస్తకాన్ని వివిధ కోణాల నుండి సభికులకు పరిచయం చేశారు. వక్తలకు సంస్థ తరఫున ప్రముఖ నవలా రచయిత్రి, డాక్టర్ పెళ్లకూరు జయప్రద, కథారచయితలు గంగిశెట్టి శివకుమార్, పొట్లూరి సుబ్రహ్మణ్యం, న్యూ అనిల్ బుక్ సెంటర్ వాసు జ్ఞాపికలు బహూకరించారు. అకాడమీ కో-ఆర్డినేటర్ పాతూనం సుబ్రహ్మణ్యం తొలుత స్వాగతం చెప్పి, చివరన వందనాలు చెల్లించారు.

### రామాయణ సప్తాహం

శారదా సాహితీ సంస్థ రామాజీ వీధిలోని ఆంజనేయ స్వామి దేవస్థానంలో శ్రీమద్వాల్మీకి రామాయణ సప్తాహ కార్యక్రమం మే 6 తేదీ నుండి 12 తేదీ వరకు నిర్వహించింది. తొలిరోజు కార్యక్రమానికి కొండా బలరామి రెడ్డి జ్యోతి ప్రజ్వలనం చేసి ప్రారంభించగా, డాక్టర్ అమృతవాక్కుల శేషకుమార్, బాలకాండ, సుందరకాండ, ఉత్తర కాండల గూర్చి వివరించారు. గువ్వల సుధాకర రెడ్డి, లక్ష్మణ శ్రీనివాసరావు వక్తను సన్మానించారు. 7 తేదీ డాక్టర్ చిమకుర్తి వెంకటేశ్వరరావు అయోధ్య కాండ కథాంశాన్ని వివరించి, కె. రామకృష్ణ చేతుల మీదుగా సన్మానం పొందారు. 8 తేదీ జి. రామగోపాల్ అరణ్య కాండను, శ్రీమాన్ కె.ఎస్. రామానుజాచార్యులు కిష్కింధా కాండను, టి.ఎల్.ఎన్. ప్రసాద్ యుద్ధ కాండల గూర్చి వివరించారు. చివరి రోజు వక్తలను సంస్థ నిర్వాహకులు సీతారామ శాస్త్రి సన్మానించారు. 12 తేదీ హనుమజ్జయంతిని జరిపారు.

### రేషన్ విడుదల

జిల్లాలో రేషన్ కార్డులకు ప్రజా పంపిణీ పథకం క్రింద మే మాసపు కోటా విడుదల చేసినట్లు జాయింట్ కలెక్టర్ జి.ఎన్.వి. ప్రసాద్ చెప్పారు. 8776 మెట్రిక్ టన్నుల బియ్యం, 1025 టన్నుల చక్కెర, 200 మెట్రిక్ టన్నుల గోధుమలు, 37 టన్నుల పామాయిల్ కేటాయించినట్లు వివరించారు. గోధుమలు కార్డుకు 30 కిలోల వరకు ఇస్తారు. పామాయిల్ ఒక కిలో లెక్కన గ్రామాల్లోని తెల్లకార్డులకు పంపిణీ చేస్తారు. మేలు రకం బియ్యం కేజీ రూ.6.50 లెక్కన కావలి, గూడూరు, నెల్లూరు టౌన్‌లో అన్ని కార్డులకు ఇస్తారు. జాయింట్ కలెక్టర్ నెలనెలా రేషన్‌పై ప్రకటన ఇస్తూనే వున్నారు గాని డీలర్లు స్టాకు పాయింట్‌లో సరుకులు సరిగా ఇవ్వడం లేదని జె.సి.పై ఆరోపణలు గుప్పిస్తున్నారు. ఎప్పుడు రేషన్ షాపుల్లో విచారించినా లేవని సమాధానం వస్తున్నదని ప్రజల ఆరోపణ. సరుకుల వాస్తవ పంపిణీపై జె.సి. నిఘా ఏర్పాటు చేస్తే బాగుంటుంది.

### సామాన్ల కోసం ప్రాణాలు పోగొట్టుకొంది

మోటారు సైకిల్‌పై వెనుక కూర్చొని వెళ్తూ, తన చేతిలో సామాన్లు జారిపోతుండగా వాటిని పట్టుకొను పోతూ రోడ్డుపై పడి ప్రాణాలు పోగొట్టుకుంది. అగ్గిపెట్టెల సుభాషిణి(27) తిరుపతికి ప్రయాణమై 10 తేదీ ఉదయం ఆర్టీసి బస్టాండుకు హడావుడిగా స్కూటర్ వెనుక కూర్చొని బయలుదేరింది. కె.వి.ఆర్. పెట్రోలు బంకు వద్దకు రాగానే ఆమె చేతిలో సామాన్లు జారిపోయాయి. వాటిని దొరకబుచ్చు కొనేందుకు వెనుకకు వాలగా రోడ్డుపై పడిపోయిందామె. మెదడుకు బలమైన గాయం తగలగా అక్కడిక్కడే ప్రాణాలు కోల్పోయింది.

### గ్రంథ సమీక్ష

4వ పేజీ కొరవ

పుస్తకం తేవాలనే తొందరపాటు, ముద్రణాశాలలు రచయితల ఓపికను పరీక్షించడం దృష్ట్యా కథల ఎన్నికలో నిబద్ధత లోపించినప్పటికీ సమాజాన్ని వివిధ దృక్కోణాల నుంచి చూసి తనదైన, అరుదైన శైలిలో కథా చిత్రాల్ని బిగించడం వల్ల శ్రీ జయంపు కృష్ణ కథా రచయితగా అభినందనకు పాత్రమయ్యారు. మొత్తం 32 కథల్ని 202 పేజీల పుస్తక చట్రంలో బిగించిన శ్రీ కృష్ణ కథల్లో నిజాయితీ వుంది. చెప్పదలచుకున్న విషయాన్ని సూటిగా చెప్పగల ధైర్యం వుంది. విషయాన్ని చెప్పే విధానంలో చక్కని శైలి, శిల్పాలు చెట్టా పట్టా లేసుకుని నడుస్తాయి.

'చావు! నీకెప్పుడు చావు?' కథలో మనను కొరల్ని తట్టి ఆర్తిని, దుఃఖోద్విగ్నతను కలిగిస్తుంది.

'నందివర్ధనం' కథ భర్త మరణించిన తులసి ఆధునిక జీవిత విహాయన పథంలో 'రేపటి మహిళ' తీసకొనే ధీరోదాత్తమైన నిర్ణయాన్ని చూపిస్తుంది.

'ఈస్ట్‌మన్ కలర్ ప్రేమ కథ' స్త్రీ, పురుష న్యాయం, కట్టుబాట్లు, ఇద్దరికీ సమానమనే విషయాన్ని చెప్పక చెబుతూనే పురుషాహంకారం పశ్చాత్తాప పడేలా చేస్తుంది. కథల్లో కెల్లా 'దుంప రాష్ట్రం' కథా రచయితకు సమాజం పట్ల గల తిరుగుబాటు మనస్తత్వాన్ని చెప్పకనే చెబుతుంది. (ఇది శ్రీశ్రీ కథకు పొడిగింపని రచయిత చెప్పినప్పటికీ) తన కుమార్తె గ్యాంగ్ రేప్‌కు గురికాగా కామందులకు భయపడి మౌనముద్ర వహించినట్లు కనిపించే పుల్లయ్య ఇంట్లో 'మెషిన్‌గన్' దాచిపెట్టడం కుమారుడు 'ఫినిష్ చేసిన శాల్తీలు, కాక తక్కిన శాల్తీల వైపు పుల్లయ్య గన్ గురి చూపించడం కథలో విచిత్రమైన మలుపు. ఇట్లా మనసును వప్పించి, "అబ్బా! భలే బాగుందాయే!", అనే కథలే ఈ సంపుటిలో జాస్తి!

మొత్తానికి జయంపు కృష్ణ తన చుట్టూ వున్న వాతావరణాన్ని, జీవితాల్ని, కళ్ళ కెమెరా ఫ్రేములో బిగించి, మనను స్టూడియోలో డెవలప్ చేసి చేతి కుంచెలతో పుస్త[illegible] కాగితాల కాన్వాసుల మీద అద్భుతమైన చిత్రాలు గీయగలడు.

సంపుటిలోని తులసి, లక్ష్మి, విశ్వమోహన్, రాజశేఖర్, శివుడు, సత్యం, సూర్య, సుధీర్, చంద్రశేఖరం, చామంతి, గోపు, రాజీ, కోటిగాడు, రజనీష్ పాత్రలన్నీ కొన్ని రోజులపాటు మన చుట్టూ పరిభ్రమిస్తూనే వుంటాయి.

సంపుటిలో రచయితను 'శ్రీమోహా' పరిచయం చేస్తే, డాక్టర్ మహీధర్ నళినీమోహన్ 'నళినీ మోహనీయం'లో అభినందిస్తారు. 'జయప్రదం'లో డా. పెళ్ళకూరు జయప్రద కథా విశ్లేషణ చేశారు.

'ఈ కథల వెనుక వెతల్లో' రచయిత నిజమైన మనసు కనిపిస్తుంది. సమాజం సంఘటనలపట్ల తనే విధంగా స్పందించింది చక్కగా చెబుతాడు రచయిత.

ఇలాంటి సంపుటిని ఆర్థికంగా, హార్దికంగా ప్రోత్సహించిన అకాడమీ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్, తిరుపతి నిర్వాహకులు శ్రీ మన్నూరు వేణుగోపాల రెడ్డి ఎంతైనా అభినందనీయులు.

### చిత్రసమీక్ష

9 పేజీ కొరవ

గ్రాఫిక్స్‌తో చిత్ర విచిత్రాలు చేసి, కళ్ళు మిరుమిట్లు గొల్పాడు; కథకు మెలోడ్రామా మేలి ముసుగు కప్పి, ఎలక్ట్రానిక్ కెమెరా బ్రష్షులతో వెలుగునిచ్చి, హాస్యపు రంగులద్ది శృంగారపు మేళవింపుతో తాను చెప్పదల్చుకున్న సందేశాన్ని కథలో, కథనంలో, సన్నివేశాలలో అంతర్లీనం చేసి, ఒక మహా గొప్ప దృశ్యకావ్యాన్ని తెరపై ఆవిష్కరింప చేశాడు. తెలుగులో ఇంత మంచి చిత్రం ఇదివరకు రాలేదని చెప్పడం అతిశయోక్తి అవుతుంది కాని, తెలుగులో వచ్చిన అతి కొద్ది మంచి చిత్రాలలో ఇదొకటని నిస్సందేహంగా చెప్పవచ్చు.

అవినీతి అనేది మన అధికార యంత్రాంగంలో అంతర్లీనమై పోయింది. కండెన లేనిదే ఇరుసు కదలనట్లు – లంచం లేనిదే ఏ ఆఫీసులోనూ కాగితాలు కదలవు. ఈ బాధ్యాన్ని తెరపై ప్రదర్శించడంలో చాలా ప్రశంసనీయమైన స్వాభావికతను, సహజత్వాన్ని సాధించాడు దర్శకుడు. ఆర్.టి.ఓ. ఆఫీసు, మునిసిపల్ కార్పొరేషన్ ఆఫీసు, పోలీస్ స్టేషన్, ధర్మాస్పత్రి, గ్రామపాలనాధికారి మనం నిత్యం చూసేవారే! ఏ మాత్రం అతి లేకుండా, బోర్ కొట్టకుండా ఆ దృశ్యాలను చిత్రీకరించడానికి దర్శకుడి బుర్ర భద్రాచలం ఎంతకు వేడెక్కినట్లు, మాడిపోయి వుండాలి.

స్వాతంత్ర్య సమర సన్నివేశాలను కళ్లముందు నిలపడంలోనూ దర్శకుడి ప్రతిభ నిరుపమానం. కథతో అచ్చుగుద్దినట్లు సరిపడే పాత్రల వ్యక్తిత్వ ఔన్నత్యాన్ని పెంచేందుకు తగిన సంఘటనలను ఎంపిక చేశారు. ఎంతో ఆలోచించి చేసిన ఎంపిక అది.

ఇంతకూ – దర్శకుడు ఈ చిత్రంలో చెప్పదలచుకున్న దేమిటి? చెప్పిన దేమిటి? అవినీతి ఎంతగా వెర్రితలలు వేస్తున్నదీ స్పష్టంగా చెప్పాడు దర్శకుడు. దాని నిర్మూలనకు హింసను మార్గంగా ఎంచుకున్నాడు. కాని చంపడం ద్వారా లంచాల జబ్బు పోగొట్టాలంటే – భారత దేశంలోని వీధి వీధినా ఎన్ని హత్యలు జరగాలి? ఒకర్నో, ఇద్దర్నో చంపితే – కల్గే ప్రయోజనమేదీ లేదని సేనాపతి స్వంత కొడుకే నిరూపించాడు. లంచం ఇవ్వకుండా హితం పట్టినా ప్రయోజనం లేదని సేనాపతి కుమార్తె మరణం సూచిస్తుంది. మరి ఈ సమస్యకు పరిష్కారం? అది దర్శకుడి మెదస్సుకు అందలేదు. ఒక సామాజిక రుగ్మతను ప్రజల దృష్టికి తీసుక వెళ్లాలనే ప్రయత్నం తప్ప, దాని చికిత్స బాధ్యత తీసుకోలేదు దర్శకుడు. తన పరిధి తెలిసి ప్రవర్తించాడు కాబట్టే ఈ చిత్రం జనాదరణ పొందింది.

ఈ సినిమాలో చెప్పుకో దగిన అంశాలు మూడు – కమలహాసన్, సుకన్యల నటన; వార[illegible] [illegible]; కంప్యూటర్ గ్రాఫిక్స్ విచిత్రాలు. సేనాపతి, అమృతవల్లి పాత్రలలో వారిద్దరూ పోటీపడి నటించారు. హాలీవుడ్ మేకప్‌కు సంబంధించి కమలహాసన్ పాత్రకు ప్రచారం వచ్చింది కాని, నిజమై మేకప్ కళానైపుణ్యం ఆ పాత్రలో కంటే అమృతవల్లి పాత్రలో కన్పడుతుంది. టివిల్లో ప్రకటనలకు, విడియోగేమ్‌లకు పరిమితమై వుండిన ఎలక్ట్రానిక్ ట్రిక్ ఫొటోగ్రఫీని సినిమాల్లోకి దించింది చిత్రం.

మాటల రచయితనూ అభినందించాలి. క్లుప్తంగా, పొందికగా వున్నాయి. పాటలే బాగులేవు – చెవుల్లో హోరు తప్ప సంగీత, సాహిత్య విలువలు సవిజానికి కూడా కన్పడలేదు వాటిలో!

చిత్రంలో హింసను చాలా విస్తృతంగా వాడినా, అది ఎక్కడా కృతి మించకుండా జాగ్రత్తపడ్డారు దర్శకుడు. మలయాళ యుద్ధకళల పేరుతో దాన్ని సున్నితంగా నడిపించాడు.

సేనాపతిని పట్టుకొనే పోలీసాఫీసరు పాత్ర – దర్శకుడి ప్రతిభకు మరొక నిదర్శనం. స్వాతంత్ర్య సమరంలో ఆనాటి భారతీయుల త్యాగనిరతిని, పోరాటస్ఫూర్తిని, అంకిత భావాన్ని విడమరచి చెప్పే సన్నివేశంలో అమృతవల్లి పాత్రను మలచిన తీరు అద్భుతంగా వుంది.

### సినిమా

9 పేజీ కొరవ

పంపిణీ చేసి మద్రాసుకు బయలుదేర వలసి వచ్చింది. ఇంతలో వేదికపై రద్దీ పెరిగిన కారణంగా అది కుప్ప కూలిపోయింది. ముగ్గురు మహిళలు క్షతగాత్రులయ్యారు. వారిని ఆస్పత్రికి తరలిస్తుండగా వెంకట లక్ష్మి అనే 48 ఏళ్ళ స్త్రీ మరణించింది. ఈ విషయం తెలిసి విజయశాంతి బాధపడి మృతురాలి కుటుంబానికి యాభైవేలు, గాయపడిన మిగతా ఇద్దరికి 15 వేల చొప్పున తాత్కాలిక ధన సాయాన్ని అందజేశారు.

### శ్రీవారంటే మావారె

"కార్మికులకు, యాజమాన్యానికి మధ్య ఉండే సత్సం బంధాలను ట్రేడ్ యూనియన్ లీడర్స్ ఏ విధంగా భగ్నం చేస్తుంటారో ఈ చిత్రంలో చెప్పదలిచాం. సుమన్ పారిశ్రామిక వేత్త, విజయశాంతి నిరక్షరాస్యురాలైన భార్య. తన భర్త ఫ్యాక్టరీలోని సమస్యలను ఆమె ఏ విధంగా చక్కబరచిందన్నదే ప్రధాన ఇతివృత్తం." అన్నారు వై. నాగేశ్వర రావు. ఈయన దర్శకత్వంలో తయారవుతున్న "శ్రీవారంటే మావారె" చిత్రంలో సుధాకర్, కోట శ్రీనివాసరావు, తనికెళ్ళ భరణి, తదితరులు ఇతర పాత్రలు ధరిస్తున్నారు. సంగీతం: కీరవాణి, నిర్మాత: ఎస్. భారతి దేవి.

### 50 ఏళ్ళ క్రితం

3వ పేజీ కొరవ

చక్కెర కుంభకోణం రహస్యం మేమిటో బయటకు తెలియనీదం లేదు. ఏప్రెల్ కోటా గూడా తెప్పించ లేరంటారు. ఎట్లాయితేనేం కలెక్టర్ వారు చెప్పినట్లు రెండు రోజుల నుండి చక్కెర కొద్దిగా దర్శన మవుతుంది. అమ్మకం కో-స్టోరులోనే. ఆ హోటళ్లలో తీపు పదార్థాలు చేయనివ్వరట. ఒక వాగిన్ చక్కెర వచ్చిందని టీక్ న్యూస్.

తెల్ల గుడ్డంతా రంగులద్దకం మీదకు పోతున్నది. తెల్లగుడ్డ గజం 7 అణాలు అయితే రంగుల గుడ్డ గజం 15 అణాలు. కోటా ఇచ్చిన గుడ్డ పగలు బహిరంగంగా పోతే అంగళ్లలో గుడ్డ రాత్రిళ్లు రహస్యంగా రంగులకు పోతున్నదని పెద్ద అలజడిగా వుంది. దీనిలో మరొక ఘోరం; తెల్లగుడ్డ 6 గజాలు 3 రూపాయిలయితే పూలద్దకం వేసి చీర క్రింద తెల్పి 15 రూ. అమ్ముతున్నారు. అంటే తెల్లగుడ్డను పూల చీరగా మార్చి ఒక్కదానికి సుమారు రూ.12 లకు తక్కువ లేని లాభంతో అమ్ముతున్నారు. ఈ మధ్య వచ్చిన 9 గ. గ్లాస్కో పంచలన్నీ గూడా పూల చీరలుగానే మారిపోయాయి.

# హరికృష్ణకోసమైనా మంత్రివర్గవిస్తరణ

మిగలకుండా పాతమారి పోవటం కంటె అదృష్టం ఇంకే ముంటుంది? అప్పుడాయన కాంగ్రెస్ పార్టీ ఒక్కరాడితో పోరాడితే చాలు. కాంగ్రెసేతర పక్షాలకు నాయకత్వమూ ఆయనదే. కమ్యూనిస్టులు ఆయన్ని అనుసరించి పోవలసిన వారే కాని, స్వతంత్రంగా వ్యవహరించే శక్తి, సామర్థ్యాలు వారిలో మృగ్యమైనాయి.

* * *

ఎన్నికలలో మెజారిటీ చూపించిన ఎమ్మెల్యేలకు; పార్లమెంట్ అభ్యర్థులుగా నిలబడి ఓడిపోయిన ఎమ్మెల్యేలకు మంత్రి పదవులిస్తానని ఆశ చూపించారు చంద్రబాబు.



బావ, బావమరదుల సంవాదం ప్రారంభమా?

అటువంటి వారు ఇప్పుడు రాష్ట్రంలో ముప్పయ్, నలభై మంది వరకు సిద్ధమైనారు. తాను చెప్పిన మాట నిలబెట్టుకోవాలంటే ఆయన వీరికి ఏదో ఒక అవకాశం కల్పించాలి. అందరికీ కాకపోయినా, కొందరికైనా హామీ నెరవేర్చక తప్పదు. అదీగాక, చాలామంది మంత్రులు ఎన్నికలలో ఘోరంగా వైఫల్యం చెందారు. కొందర్ని వదిలించుకొని, మరికొందర్ని భుజం తట్టడానికి చంద్రబాబు త్వరలో మంత్రి వర్గ విస్తరణ తలపెడ్తున్నారు. ఢిల్లీ రాజకీయ గడబిడ ముగిసిన తర్వాత బహుశా జూన్ రెండవ వారంలో ఈ ముహూర్త నిర్ణయం జరుగవచ్చు. ఇదివరకటి వలె ఎమ్మెల్యేలు కూడా ముఖ్యమంత్రిని బెదిరించే పరిస్థితి లేదు. అందువల్ల ఆయన తన ఇష్టానుసారం మంత్రివర్గ విస్తరణ జరిపే వీలుంటుంది.

అయితే హరికృష్ణ సమస్య ఒకటి చంద్రబాబు కోసం ఎదురు చూస్తున్నది. బ్రహ్మాండమైన మెజారిటీతో ఆయన ఎమ్మెల్యేగా గెల్చి వచ్చారు. గెల్చిన తర్వాత ఎక్కువ కాలం పూరకే కూర్చో వుండే తత్వం కాదు, చంద్రబాబు ఆరి, తీరి మంత్రి వర్గ విస్తరణ జరుపు తానంటే ఆయన ఓపిక పడతారని

చంద్రబాబు
మొదటి పేజీ కొరవ

భావించలేము. ఏదైనా త్వరగా జరిగి పోవాలి. అయితే హరికృష్ణ ఒక్కడి కోసం మంత్రి వర్గ మార్పులు తలపెడతాడా ముఖ్యమంత్రి? అందరితో పాటు నువ్వూ అంటే – సర్దుకపోతాడా హరికృష్ణ? చంద్రబాబుకిది పెద్ద సమస్యే. దీన్ని ఏదో ఒక రూపంలో పరిష్కరించక తప్పదాయనకు. హరికృష్ణ కోసమైనా త్వరలోనే మంత్రి వర్గ విస్తరణ జరిపినా ఆశ్చర్య పడనవసరం లేదు.

చంద్రబాబుపై అలిగిన ఎమ్మెల్యేలకు ఒక్క హరికృష్ణ ఒక్కడే దిక్కు – ఓదార్పు పొందడానికి. పార్లమెంట్ ఎన్నికల ముందు హరికృష్ణ తన బావగారిపై మండిపడు తుండినాడు. ఆ కోపం ఇప్పుడూ వుందో లేక సమయం కాదని సర్దుకు పోతాడో తెలియదు. ఇప్పటి వరకు రాష్ట్రంలో మామా అల్లుళ్ళు; అత్తా అల్లుళ్ల రాజకీయం చూశాం; ఇక నుంచి బావ, బావమరిది సంవాదం తిలకించ బోతున్నాం.

## వాజ్‌పాయి

రెండవ పేజీ కొరవ

కాబట్టి, రాష్ట్రపతికి వెంటనే సందేశం పంపుతామని పివి సూచించారట. అందుకు అందరూ సమ్మతించారు. అప్పటికప్పుడే – ఒకే ఒక వాక్యంతో దేవగౌడకు మద్దతు తెల్పుతున్నట్లు రాష్ట్రపతిని వుద్దేశించి లేఖ తయారు చేశారు. అప్పటికి – వాజ్‌పేయి మధ్యాహ్నం 2 గంటలకు రాష్ట్రపతిని కలవబోతున్నారన్న సంగతి పివికి తెలుసు. కాని ఆ లేఖను ఆయన రాష్ట్రపతి భవన్‌కు పంపలేదు. ఆ సంగతే పట్టనట్లు మధ్యాహ్నం భోజనం చేసి, నిద్రకుపక్రమించారు. 3 గంటల వరకు లేవలేదు. ఈ లోగా రాష్ట్రపతి వాజ్‌పేయిని కలవడం, ప్రభుత్వ ఏర్పాటుకు ఆయన సమ్మతించడం జరిగిపోయాయి. ఆ తర్వాత గంటన్నరకు (3.25) పివి లేఖ రాష్ట్రపతికి చేరింది. బిజెపిని అధికారానికి దూరంగా పెట్టాలనే వుద్దేశ్యం పివికి వుండి వుంటే – లేఖ పంపడానికి ఎందుకు ఆలస్యం చేస్తారన్నది ప్రశ్న. ఆ లేఖ వెంటనే చేరి వుంటే వాజ్‌పేయికి ఆహ్వానం అందజేయడానికి రాష్ట్రపతి తటపటాయించ వలసి వచ్చేది. ఏదో వుద్దేశ్యం మనసులో వుంచుకొట్టే పివి ఈ ఆలస్యం చేశారన్నది నమ్మదగిన వాస్తవం. అది ఏది? వాజ్‌పేయి, పివిల మధ్య ఏదైనా రహస్య ఒప్పందం వుందా? నిలకడ మీద కాని నిజం తెలియదు.

కేవలం పివి సహకారంతోనే వాజ్‌పేయి ప్రధాని కాగలిగారని ఇతర పార్టీలు విమర్శిస్తున్నాయి. ఈ సహకారం లేఖను ఆలస్యం చేయడం వరకేనా లేక రేపు బలపరీక్షలోనూ అందించ నున్నారా? ఇప్పటికే ముస్లింలు కాంగ్రెస్‌కు దూరమై వున్న పరిస్థితులలో బిజెపి ప్రభుత్వ మనుగడకు కాంగ్రెస్ తోడ్పాటు అందిస్తే – వారు కాంగ్రెస్‌కు శాశ్వతంగా దూరమై పోతారు. అది పార్టీని హత్య చేయడమే అవుతుంది. అంతటి దుస్సాహసానికి పివి పాల్పడతారా ? ఏది ఏమైనా పివి నరసింహా రావుగారి మధ్యాహ్నం నిద్ర దేశ రాజకీయాలలో ఒక చరిత్రాత్మక ఘట్టానికి కారణమైంది.

కాంగ్రెస్‌లో చీలిక రాకుంటే వాజ్‌పేయి ప్రభుత్వం నిలబడడం అసాధ్యం. అది పడిపోతే తదుపరి అవకాశం కాంగ్రెస్‌కు లభిస్తుంది. కేవలం 136 సభ్యుల బలంతో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడదు. వామపక్షాలే కాక, చంద్రబాబు తెలుగుదేశం వంటివారూ ఎట్టి పరిస్థితులలోనూ కాంగ్రెస్‌ను బలపరచరు. అందువల్ల తదుపరి అవకాశం జనతాదళ్‌కు ఇవ్వాలి. కాంగ్రెస్ (136), సిపిఎం (32), సిపిఐ (12), ములాయం సింగ్ సమాజ్ వాద్ పార్టీ (17), ఆలిండియా ఫార్వర్డ్ బ్లాక్ (3), ఆర్ఎస్‌పి (5), అస్సాం గణపరిషత్ (5), చంద్రబాబు (16), మూపనార్ కాంగ్రెస్ (20), డిఎంకె (17)లు కలిస్తే జనతాదళ్ (43) ఫ్రంట్‌కు 306 మంది సభ్యుల మద్దతు లభిస్తుంది. చాలా పెద్ద మెజారిటీ ఇది. అయితే ఫ్రంట్‌లో 7 పార్టీలు, ఫ్రంట్ బయట 3 పార్టీలు, కాంగ్రెస్‌తో కలిసి 11 పార్టీల కలగూర గంప అవుతుంది. వామపక్షాలు, కాంగ్రెస్ పార్టీ తాము బయట నుంచి మద్దతు నిస్తామని ప్రకటించాయి కాబట్టి – తక్కిన పార్టీలన్నికీ కలిపి 96 మంది ఎమ్పీలుంటారు. 50 మంది మంత్రులు, స్పీకర్, డిప్యూటీ స్పీకర్, ఇతర ప్రభుత్వ పదవులన్నీ కలిపితే – ప్రభుత్వ పక్షంలోని ప్రతి ఎమ్పీకీ ఒక పదవి ఇవ్వాలి. చాలా అపహాస్యమైన పరిస్థితి అది. తెలుగుదేశం, డిఎంకెల వంటి వాటిలో రాష్ట్రానికి ఐదారుగురు కేంద్ర మంత్రులు తయారౌతారు. పోనీ అట్లా కూడా ప్రభుత్వం ఏర్పాటు చేసినా – ఇన్ని పార్టీలను కలిపి వుంచడం ఎట్లా? ప్రభుత్వం ఏర్పాటుకు అవకాశం వచ్చే సూచనలు కన్పించినప్పుడే జనతాదళ్ నుంచి రెండు రోజులలో ముగ్గురు నాయకులు – విపి సింగ్, రామకృష్ణ హెగ్డే, దేవగౌడ్‌ల పేర్లు ప్రధాన మంత్రులుగా విన్పించాయి. ఇక అధికారంలోకి వస్తే ఇంకెన్ని పేర్లు వెలికి వస్తాయో తెలియదు. అదీగాక – డిఎంకె, తెలుగుదేశం, అస్సాం గణపరిషత్ వంటి ప్రాంతీయ పార్టీల బ్లాక్‌మెయిల్‌కు తలవొగ్గి ప్రభుత్వాన్ని నిలుపుకొనే చాకచక్యం ఏ నాయకుడికి వుంది? అది నిలిచే ప్రభుత్వం కాదు కాబట్టే సిపిఎం జ్యోతిబసు నాకు ప్రధాని పదవి వద్దంటే వద్దని తిరస్కరించారు తప్ప. నిల్చే ప్రభుత్వమన్న నమ్మకం కల్పించుంటే వామపక్షాలు ఈ సువర్ణావకాశం వదులుకొంటాయా? అందువల్ల ఈ మూడవ ఫ్రంట్ ప్రభుత్వం ఏర్పాటు, మనుగడ అనుమానమే!

అయితే ఏదో ఒక ప్రభుత్వం ఏర్పాటు కాకుండా, పార్లమెంట్ రద్దయ్యే పరిస్థితి ఏ ఎమ్పీకి సమ్మతం కాదన్నది నిజం. మూడు నెలల్లోనో, ఆరు నెలల్లోనో మళ్లీ ఎన్నికలను ఎదుర్కొనే రాజకీయ సామర్థ్యం, ఆర్థిక వనరులు ఎవరికీ లేవు. అంతంత ఖర్చు పెట్టి, అంత శ్రమపడి, అన్ని ఆటుపోట్లను ఎదుర్కొని గెల్చుకున్న పదవిని చూస్తూ చూస్తూ వదులు కొనేంత అవివేకులు ఎవరూ వుండరు. అది బిజెపి కాని, మరొకటి కాని కేంద్రంలో ఏదో ఒక ప్రభుత్వం నడవాలనే వారు కోరుకుంటారు. ఈ కోణం నుంచి చూసినప్పుడు రాజకీయ పరంగా రానున్న కొద్ది వారాలలో చాలా నూహిత మార్పులు చవిచూడవలసి వస్తుందన్పిస్తుంది. పార్టీ నిబద్ధతలు, సిద్ధాంతాలు, నాయకత్వం పట్ల విధేయతలు, గాలికి కొట్టుకు పోయి నూతన కలయికలు, మార్పులు జరుగక తప్పదన్పిస్తుంది. ఆ మార్పులు ఏ రకంగా వుంటాయి, ఏ ప్రభుత్వానికి అనుకూలంగా వుంటాయన్నది వేచి చూడాల్సిందే తప్ప, వూహించే విషయం కాదు.



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, Nellore